# FOREWORD

I deem it a proud privilege to have been invited by the author, 'Madhurakavi' Sri. Belluri Srinivasa Murthy to write the foreword for his little book "Tapovanam". The author was an ardent disciple of my Father-in-law, Late 'Maha Mahopadhyaya Kalaprapurna Doctor Chilukuri Narayana Rao, M. A., Ph. D. L. T., a well Known literary critic. The budding poet was encouraged, nurtured and nourished by him perhaps this honour done me reflects his deep reverence to his 'guru'.

A new era has emerged in Rayalaseema with the advent of poets like Sri Gadiyaram Venkatasesha Sastrulu, Puttuparthi Narayanacharlu, Sri. Belluri Srinivasa Murthy etc., The days are not far off when we may witness the hay day of literary revival of Sri Krishnadeva Raya again.

Sri Belluri Srinivasa Murthy is well-known in the literary field. He hails from Talamarla, a village in Penukonda Taluk. The Rayalaseema Kala Parishad rightly bestowed on him the title of 'Madhurakavi' at the time of the celebration of Thikkana Kavi Jayanti at Hindupur, on First March 1947. He reminds us of the ideal of Ancient India, "Simple living and high thinking". He is a philosopher. He rarely speaks. It is no wonder, if he is called a "Tapasvi", and the title to his book 'Tapovanam' is very appropriate.

"Tapovanam" is a collection of poems written by the author at defferent times. They have had been

published in many periodicals like Bharathi, Andhra patrika etc.

The topics dealt with by him are mainly of common things in nature like a roar of thunder, a dry leaf in winter and a brook in the mountain valley. He worships God in the beauty of nature. He finds significance in every insignificant thing. He is at his best when inspired. To illustrate, poems like "అజ్ఞానము, విషాదగీతి" can be cited. Poetry flows like a stream and not written. Every poem in this little book is pregnant with strong feelings and lofty ideas. The lay man is at pains to grasp them quickly. I strongly wrge him to study them in silent and solitary mood so that he can better appreciate and enjoy the beauty of his poetry.

Sri 'Belluri's' students have made great efforts to collect subscriptions and get this book printed. May the generous public help him from time to time to present his literary works to the present and succeeding generations.

This little book is best suited to be prescribed as a text-book for the University classes. May God bless him to earn a name and fame in Andhradesa.

JAI HIND.

K. C. Board High School,
Kalyandrug.
26—3—54.

G. Srinivasa Rao, M.A., B.T.,
Head-master.

# అంకితము



రామ కథపాడి మోక్ష సామ్రాజ్యమునకు
ఏకఛత్ర మారసితివి వాల్మీకి సుకవి,
ప్రేమ నేనొక సుతునభి 'రామగాథ'
అల్లుకొని యల్లుకొని శాంతి యలవరింతు.

## భారతికి — ప్రత్యేక ప్రణామము

భారతి ఆంధ్ర దేశములో ఉత్తమసాహిత్య మాస పత్రిక. ఎ తత్సంపాదకులు దేశోద్ధారకులు కాశీనాథుని నాగేశ్వరరావుగారు సజీవులై యున్న కాలమునందే భారతితో నాకవితకు పరిచయము కలిగినది. నా తపోవనమునందలి ఖండికలనేకములు ప్రచురించి, తెలుగు నేలలో నాలుగు మూలల కవితా వ్యాప్తికి త్రోవ జూపి తోడ్పడినదీ పత్రికారత్నము.

అవ్యాజ్య వాత్సల్యముతో "భారతి" భిక్ష పెట్టక యున్నచో "నా జీవితము"లో ఏనాడో కవితా సన్యాసము స్వీకరించి యుండ వలసినవాడనే. భారతి నాకు గావించిన మహోపకృతి మఱువు రానిది. నా "తల్లి"కి కృతజ్ఞతతో ప్రత్యేకముగ ప్రణమిల్లు చున్నాను.

— బెఝ్వాడి

# తపోవన ప్రశంస

రాయలసీమలోని పల్లెటూరి వివిక్త జీవితమునకే అలవాటు పడి అందే తమ భావనానంద యోగమున మగ్నులైన కవులెందరో యున్నారు. వీరిలో అగ్రపంక్తి ఈ గ్రంథకర్తగారిది.

పద్యము చదువగానే కవికి ఆర్జవ గుణమెంత యుండునదియు కావ్యానుభవ రసికులకు స్పష్టముగా తెలిసిపోవును. ఈ యార్జవ గుణము నిండియుండుటను శ్రీనివాసమూర్తిగారి కవనమందు ప్రతి పద్యమునందును మనము చూడవచ్చును. ఈ గుణముచే వీరి సుందర వస్తు ప్రపంచము విశాలమైనది.

— శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ (1948)



రాయలసీమ కవులలో ఆధునికులలో అగ్రేసరులలో మీ రొకరనడానికి సందేహము లేదు.

........శ్రీనివాసమూర్తి రాయలసీమారణ్యములో ఒక పరిమళ పుష్పము. తెలుగు కవితమర్మము నీతడు చక్కగ గ్రహించినాడు.

...... కళాప్రపూర్ణులు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు M. A P. HD. (1944)



మీ కవిత్వము లలితమై శ్రవణ సుభగమై మెఱుగు దేరి యున్నది. సామాన్య విషయములు మీ హృదయమున ప్రవేశించి కవితగా మూర్తీభవించుట రసజ్ఞుల భాగ్యము.

కవితా మార్గమున ఆంధ్ర సారస్వతమున మీకు ఉత్తమ స్థానము దొరకగలదని నేను ఆశించుచున్నాను.

— కవికోకిల దువ్వూరి రామిరెడ్డి (1938)



కవీంద్రా! మీరచనలు భారతియందు చూచియుంటిని. మీ కవిత పండితపామర రంజకమై ప్రౌఢమై యున్నది. మీ మధురకవి బిరుద సార్థక్యమును చాటుచున్నది.

— అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తి చౌదరి (1953)

శ్రీ బెళ్ళూరి శ్రీనివాసమూర్తిగారు రాయలసీమ కవి కుమారులలో నగ్రేసరులు. రాయలసీమ తపస్వి.

— బులుసు వెంకటేశ్వరలు M.A. (1949



మీ కావ్య వస్తువు వేదన, మాకది మధుర వేదన.

— జమ్ములమడక మాధవరాయశర్మ.



మాతో— శ్రీనివాసమూర్తి "కీట్సు" వంటివాడు.

పుట్టపర్తి



పరమస్థలైన మహాకవుల త్రోవలోనున్నది.

— సి. వి. సుబ్బన్న. శతావధాని



మహాకవులకు —

మీ కవిత్వము ప్రసాదగుణ భూయిష్ఠమైనది. ఇది సుఖ దుఃఖములు కలుగనిది కాదు. మీరు కవి తపస్వులరు.

— కవిసార్వభౌమ దుర్భాక రాజశేఖర శతావధాని.



మధురకవి బెళ్ళూరివారు పుట్టి పెరిగినది పల్లెసీమ. పల్లెటూరి పరిసరములందు సెలలు, శాద్వలములు, సైకత శ్రేణులు, జంటబాయని శారికలు, పికకుమారికలు, కాపుచెలులు, కర్షక సఖులు, భిక్షుకులు, బీదలు, సహజ శోభలీనెడు పూదీవలు, కేదార సీమలు. కొత్తిమెర పైరులు, మొదలగునవి వీరి కవితా వస్తువులు

శైశవమునుండియు బీళులే నా పుస్తకాలయములనియు, ఏకాంత వాసినై ప్రకృతి యొడిలో లాలింపబడుటయే నాజీవిత పరమార్థమనియు, మధుర భావనారమ్య సీమలయందు స్వైర విహారమును సలిపిన ధన్యాత్ముడీకవి.

ప్రకృతి లక్ష్మి మధుర కవిని యుపగూహనలో లాలించి, బుజ్జగించి దివ్యోపదేశ మొసంగినది, ఈ కవీశుడెంతయు ధన్యుడు, వీరి రచనలు **"మహాకవి కాళిదాసు"**ను దలపింపజేయు ననుటలో నతిశయముండదు.

—విద్వాన్ తలమర్ల కళానిధి

## ౧. శిశిరపర్ణములు

కుప్పవోయుదునా
నాప్రభూ — నీమ్రోల
రాశివోయుదునా ?
నా తపోవనములో
నాటిపెంచిన చెట్ల
శిశిరమారుతహతుల
శిథిలమై పడియున్న
జీర్ణపత్రము లూడ్చి
కుప్పవోయుదునా ?
నాప్రభూ — నీమ్రోల
రాశివోయుదునా ?
వాసంత వైభవము
వాడుకొను నీమనసు
శిశిరశోభలకొఱకు
చింతించునా
నాప్రభూ !
పల్లె జీవితమన్న
పాటించునా ?
కుప్పవోయుదునా
నాప్రభూ ! — నీమ్రోల
శిశిరపర్ణము లేర్చి
రాశివోయుదునా ?

# ౨. కుసుమదామము

రాలినపూలుకొన్ని పొదలన్ వికసించిన పూలుకొన్ని వా
తూలహతిం జలించి భువిఁ దూలక కొమ్మలఁ జిక్కికొన్న యా
పూలొక కొన్నియేరి శ్రమఁ బొందితి మాలికఁ గూర్చి తెచ్చితిన్
ఏల నిరాకరించెదవొ యీశ్వర నాహృదయంబు శోషిలన్.

అతులితకాంక్ష నేను కుసుమాపచయం బొనరించు వేళ సై
చితి నురుగ్రీష్మతాపమును స్వేదమయంబుగ దేహమెల్ల, నా
కత లెఱిఁగింపఁ బూనుటకు కాలములేదు, త్వదీయరాగ లా
లితమధురావలోకనము లెత్తి ననున్ క్షమియింపఁగా దగున్.

సురభిళముల్ ప్రసూనములు శోభలు మాయవు స్వామి, నీ నిరా
దరణపుఁ జేతలన్ కుసుమ దామము నవ్వలఁ బాఱఁద్రోయ ని
ర్భరపరివేదనా ప్రచుర బాష్పము లొల్కఁగ, నెన్నఁడైన నా
మొఱకు దనంపు కాంక్షఫల మొందకపోదని దాఁచి యుంచితిన్.

దేవా! నీయెడ శూన్యమయ్యె ననుసందేహంబు బాధింప, నా
భావంబెల్ల నిరాశతో గలఁగిపోవన్ భారమైదోఁచు నా
జీవం బంచుఁ దలంచితిన్ జడత, నీ సిద్ధాంతమేమో, మదీ
యావాసంబున దొంగిలించెదవొ పాయంజాల కీమాలికన్.

కాలవిలంబనంబునకు గాసిలలేను నితాంతరక్తి నీ
యాలయ సీమచెంగట విహారము సేతు, క్రుధావలోకన
భ్రూలతికావికారముల పొల్చిన నాపయి సైఁచికొందు, పూ
మాలిక వాడిపోవ నిఁక మంజులతల్ కృశియింపవే ప్రభూ!

మ్లానత చెందినన్, కుసుమ మాలిక కాంతులు దప్పిపోయినన్ మానఁగలేవు, నీహృదయ మర్మము నే నెఱుఁగంగలేనె, స్వామీ, నిముసంబులోన విరమించెదు క్రమ్మఱ నవ్యరీతి నిర్మాణము సేయుచుందు ననురాగ రసోదయ లాంఛనంబుగన్,

సుమదామంబును గూర్చు వేళ మనుమోసుల్ వోయె నా కోర్కులు ద్యమమెల్లన్ ఫలియించునంచు, కయిసేఁతల్ గొన్న నీకంధరంబు మహానందము గూర్చునంచు మదిలోఁ బొంగారితిం గాని దైవము, యూహింపఁగరాని దుర్వ్యథల నవ్యాజంబుగాఁ గూర్చితే?

కరములఁదాల్చి యీకుసుమ కల్పితహారము నేఁ దపింతు, నాదరణము నీకుఁ గల్గునని తత్పర భావము మానముద్రయున్ పరమసుఖానుభూతి గొలుపన్ కడదోయిదుఁ గాలమింక నే తరుణము నిర్ణయించితివొ తావకసేవకు నన్నుఁ బిల్వఁగన్.

---

## ౩. నే ను

పరిమళింపని దోర్కు పుష్పంబు లేను
నేను విహరింపఁజనిన వనీతలాల
సుకృతవశమునఁ గలిగిన సుఖములందు
సోలలాడితి సూావనోన్మిలనమున.

పక్షికృతమైడిలోన సుఖసుప్తి వడయుచుండు
కోయిలలు లేప నిదుర మేల్కొనుచునుందు
అడవికోనల సెలయేటి పడుచుఁగాంచి
పరమసంతోషభరమునఁ బలుకరింతు,

సొబగు లీనెడు ననకారు శోభఁజూచి
గాఢ నిశ్వాసములు నించి కదలిపోదు
ఘోరమైనను, మేఘనిర్ఘోషములకు
పరిమితియెలేని మోదంబుఁ బడయుచుందు.

మొగ్గనై యాకుమఱుఁగునఁ బొలుతునేమొ
పూవుగాఁ బూచి పరిమళ మొలుకఁబోతు
నో, విహంగమై పరతునో, భావగీత
మగుదునో, నేను భావి జన్మములయందు.

మధురభావనా రమ్యసీమలనుగాక
శిథిలమగుగాని నిలువ దీజీవకళిక
అమలమైన ప్రేమారాధనమునఁ గాక
బ్రదికి సుఖియింపలేదు నా ప్రాణమిలను.

అల్లువాఱెడు కాంక్షల నణఁగఁద్రొక్కి-
ఆపఁగారాని యంతరాయములు గలుగ
నెడఁద బగులంగ వెఱ్ఱినై యేడ్చుచుందు
దరిసి మందమారుతములో దాఁగిపోవ.

కాంక్షలే వేలు, నామనోగతులె వేలు,
పూరిగుడిసెలలోనైన నఁ బుట్టుఁగాని
గీతమల్లక బ్రదుకు సాగింపలేను
భావగానంబె నాదు సర్వస్వమవని !

# ౪ స్వేచ్ఛా విహంగము

ఏను స్వేచ్ఛావిహంగమనే మహీరు
హాగ్రశాఖికావితతులం దధివసించి
కాలమును బుత్తునో, మదిఁ గలఁచినైచ్య
దారుణ విషాదబంధముల్ తలఁగనేఁడు.

పవనతరంగముల్ వ్రాలసి పాదప శాఖలనల్ల నూఁప నై
భవమునఁ దేలిపోవు దివిఁ బ్రాఁకెడు డోలిక యందుఁ దూఁగుచున్
పరివిమల రాగగీతికలు పల్కుదు నొక్కొక వేళ లోచనో
త్సవకరమైన యీప్రకృతి తన్వి విలాసముగాంచి నివ్వెఱన్.

ఫలముల్ మెక్కుదునో, వనాంతరసరస్వాదూదకంబుల్ మనం
బలరన్ గ్రోలుదునో, లతాంతతతి ఛాయన్ సొంపు పెంపార ని
ర్మలకుంజాంతర వీథులన్ దిరుగుచున్ మధ్యాహ్నముల్ ద్రోతునో
కలిగెన్ స్వైరవిహారభాగ్య మిఁక నుగ్రాంతవ్యథల్ వాయఁగన్.

ఏను స్వేచ్ఛాశకుంతమనే మహీరు
హాగ్రశాఖికావితతులం దధివసించి
కాలమును బుత్తునో — ఒక కల్పమైన
ప్రకృతి మాధుర్యతృష్ణఁ దీర్చుకొనుదాఁక.

## ౨ సౌందర్యపూజ

అవలఁద్రోసితి కాంతాకుచయుగ్మమెల్ల
పోవుచుంటిని సౌందర్యపూజకొఱకు
ఏమి లభియింపనున్నదో తెలియఁగరాదు
అంతరంగంబు పారవశ్యమునఁ దోఁగు.

గద్గదికఁ దోఁచు పలుకుల, కనులఁ దొఱఁగు
బాష్పకణముల, భావనాపథముఁ బట్టి
పోవు ననుఁ జూచి యున్మాదమూర్తి యనుచు
ఎన్నిసారులు నవ్విపోయినదో జగము !

కన్ను లలరించు నెలపోయగమ్ముఁ జూచి
మొక్కులిడుచుంటి నా కరమ్ములను మొగిచి
మంజులంబయితోఁచు బ్రహ్మాండమెల్ల
కౌఁగిలింతు నొక్కొకమారు గాఢరక్తి.

కొండ చరియలలో, చెట్లగుబురులో, మ
నోజ్ఞసైకతభూమిలో నుగ్రతపము
నాచరించుచునుందు నేనహరహంబు
ఆఁకలియు లేదు దప్పియు నాకు లేదు.

సలిపిన ప్రయత్నమెల్ల నిష్ఫలముగాఁగ
మరల యత్నించు పరితాపభరము లేని
విమల సౌందర్యపూజకై వెడలుచుంటి
మృదుమధురగీతికారవ ముదితహృదిని.

పాలకంకులపైన సుమాలలూఁగి
కలకలారావ గద్గదగాత్ర మెత్తి
హర్ష వశమున నన్నుఁబిల్చు నలవిహంగ
మములు సౌందర్యపూజకు మనసుగొలిపి.

అలరులంబోలు మృదుల శయ్యాతలాన
కనులు మోడ్చిన విరహిణీకాంత యొర్తు
అనవరతమును నను ఁబిల్చినట్లు తోచు
మధుర సౌందర్యపూజకు మనసు గొలిపి.

పవనపరిరంభణసుఖమ్ముఁ బడసిపడసి
సోలిపోయెడు వల్లరీబాల యదిగో!
నవ్వుమొగమున రమ్మని నన్నుఁబిల్చు
నమల సౌందర్యపూజకు నాసగొలిపి.

ఫలము గలుగునో కలుగదో వలదు చింత
శాంతమతినై, వినిర్మల సహజమధుర
లలిత సౌందర్యపూజకై రక్తిఁబూని
కదలిపోయెద నవ్యమార్గములయందు.

దివ్యశింపాలతలు నాకుఁ దెరువుసూప
తోయదగభీరఘోషముల్ తోడుపడఁగ
నవ్యపథముల భూనభోంతరము దాఁటి
పోవుచున్నాను సౌందర్యపూజకొఱకు.

# ౬. తొ లు కా రు శో భ

రాలిచిపోయె నీపరిసరంబులలో నొకకొన్ని శుష్కప
త్రాలు సమీరనందనుఁడు రమ్యవనీస్థలమెల్ల పల్లవ
శ్రీలలితంబుగా ప్రకృతి రీతులుమారెను, నేవినూత్న భా
వాలు స్పృశించు నాయెడద పైకొని యీమధుమాసవేళలన్,

కడచిన వేదనాభరము కన్నులనీరు దొలంచివైచి యీ
యెడనెలమావి మోకపయి నింపుగఁ బాడెడి కోకిలంబుతో
విడువనినేస్తమున్ సలిపి విశ్వమనోహరగీతికావళిన్
దడుపుదు నాజగంబు, నొక తన్మయభావములో సుఖించుచున్.

ఈరమ్మునల్ కుసుమించె పాంథహృదయం బేకాగ్రితంజెంద, వి
స్తారంబౌ తొలుకారుమేఘముల నాచ్ఛాదించె వ్యోమమ్ము హృ
ద్భారంబున్ తొలగించి యీనవఋతు ప్రారంభమున్ గాంచి నే
నారాధింతును-నాతపోగతులలో నానందమున్ బొందుచున్.

విరహములో కృశించి పలవించిన ప్రేయసియున్ ప్రియుండు మో
దరసవశాత్ములైరి, నడు దారుల సంఘటనంబుగూర్చు నీ
శ్వరుని కృతజ్ఞతాంజలుల భావనసేసి, వసంతదివ్యవై
ఖరులిటుజూచి నామధుర గానములో నినుసంబు బుత్తునా

---

# ౭. ప్ర భా త వ ల్ల కి

కడచిపోయెను పూర్వజీవిత
గాథలేవో విస్మృతింబడి,
కడలనెల్ల నవీనరోచులు
కరుడుగట్టినవి

శాశ్వతంబైన శకుంతగానము
స్వాంతముల గఱగింపుచున్నది
మాతృసేవా మధురిమమ్ముల
మలయు సౌఖ్యములు.

తరుణమున నీ హృదయవీణా
తంత్రులను కదలింపమోయీ
తరుణతరుణ హృదంతరమ్ములు
తాండవింపగను.

ఎన్నిమూర్ఛన లుద్భవంబై
ఎంతబ్రహ్మానందమొదవునొ
భావభరిత ప్రభాతవల్లకి
పాటలో నింకన్,

కాలవాహిని కలసిపోయిన
గాథలోనే లీనమగునో
ఘనవినూతనవాఙ్మయోదయ
గర్భమే గదలింపునో.

## ౭. ఋతుపరిదేవనము

మావిచిగుళ్ళ మేసి రస మంజులగీతము లాలపించి ప్రే
మావిలముం బొనర్ప జగ మంతయు కోకిలబాల, పూలనె
త్తావులతో వసంతము సుధామధురంబుగఁ దోపమున్న నా
జీవిత మిట్టిశోభల హసించినదంచుఁ దలంచి యేడ్చెదన్.

లతికాపుంజము శోషిలన్ శిలలు గాలన్ వృక్షశాఖాగ్రసం
తతులున్ కాంతివిహీన మొందఁగ సమస్తంబైన లోకంబు నీ
గతినార్తిన్ బడద్రోయు గ్రీష్మముఖముల్ కన్నారఁగాఁ జూచి నా
బ్రతుకీనాఁడు తపించు నిట్లె యనుచున్ భావించి నేనేడ్చెదన్.

కనులంజేల్చు క్షణప్రభాకలితమున్ గంభీరగర్జాప్రతి
స్వన ఘోరమ్మును మోహనమ్మునగు వర్షాకాల మాధుర్య మె
య్యానఁ దోపంగ, వియోగరాగభరితంబై మంజులంబైన జీ
వనమున్ దోఁసిన యాదినంబులు మదిన్ బాధింపఁగా నేడ్చెదన్.

తరళజ్యోత్స్నల రాల్చు జాబిలి, లతాంతశ్రేణిఁబోలెన్ మనో
హర తారానిచయమ్ము లాకసమునిండారన్ శరత్కాల శ
ర్వరు లేతేరఁగఁ జూచి మోహనకళల్ రాణించు నాజీవిత
స్మరణానందముఁ గొంతబోల్చి విషాదాకరే మగ్నమై యేడ్చెదన్.

ఎఱకలు మోడ్చి గూళ్ళవిడి యేఁగక పక్షులు తల్లడిల్ల దు
ర్భరతరశైత్యబాధకు ప్రభాతము రేలు, సమస్తలోకమున్
కరము వడంకిపోవ, హిమకాలము గాంచి భవిష్యదర్థముల్
స్మరణ మొనర్చి దుస్సహ విషాదము నొందె, వడంకి, యేడ్చెదన్.

ధరణిన్ రాలిన శుష్కపత్రవితతిన్ తార్మారుగావించు తె మ్మెరలన్ శైశిరవాసరోదయముగా, మిథ్యాప్రపంచంబు న శ్వరమీకాంక్షలు రాలిపోయెదు సమస్తంబన్న తత్త్వంబె యాం తరవీథిన్ గలుగింప నెందులకొ సంతాపించి నే నేడ్చెదన్.

---

## ౯. ఎట్లు మరణింతు!

లలిత సాంధ్యరాగంబులు, వలపుగోలుపు
నలశకుంతగీతంబులు, చెలిమినెరపి
బ్రిదుకు తెరువైన ప్రకృతిసంపదలు విడిచి
యెట్లు మరణింపవలెనంచు నేడ్తు స్వామి.

ప్రకృతిలో నిన్ను, నీలోన ప్రకృతిసొబగు
భావవీథుల నూహించు పరమసుఖ ప
రంపరయె నాకు నింక దూరంబు గాఁగ
నెట్లు మరణింపవలె నంచు నేడ్తు స్వామి.

మఱచి, నాజీవితంబున నెలుకమాలి
వెఱ్ఱినై, మోవిఁజేర్చిన విసపుగిన్నె
నమృతము సృజించె ప్రకృతి సౌందర్యమహిమ
యెట్లు విడనాడి మరణింతు నింకస్వామి.

మింటఁ జెలువొందు నాషాఢమేఘములకు
మధురతరమైన కేదారమాలికలకు
మైత్రి పొసఁగించు ప్రకృతి పవిత్రభావ
మెట్లు విడనాడి మరణింతు నింకస్వామి.

ప్రకృతి పూజించి, తన్మయత్వంబునొంది
పరమఋషులొందు నానందభాగ్యమునకు
దవ్వుగా, కాంక్ష లెల్ల వ్యర్థములుగాఁగ
నెట్లు మరణింప వలెనంచు నేడ్తు స్వామి.

## ౧౦ పశ్చాత్తాపము

పక్షిగా, ప్రసవంబుగా, భావవీచి
గా, మనోహరనిర్ఝరిగాఁగ నాకు
దరిసెన మొసంగి పోవు నీసరణులెల్ల
హృదయమునఁ దోఁచి, పిదపఁ దపింతునాథ!

కలకలంతరవంబులఁ బలుకరించి
లలితసుమసౌరభములతోఁ గలయఁదిరిగి
గాలిలోఁ దూఁగి, సెలయేటిగతుల నడచి
ఐక్యమై పోవనిమ్ము నీయందునాథ!

జీవితములోని సుఖదుఃఖభావములకు
నీవె కారణమైయుంటి వింతవరకు
ఘోరతపమునఁ గుంగి శరీరలతిక
హృదయ మొక్కఁడె మిగిలిపోయినది నాథ!

మెఱపుగా, గర్జితంబుగా, మేఘమాల
గా, సురేంద్రచాపప్రభగాఁగ నాకు
దరిసెన మొసంగిపోవు నీసరణులెల్ల
హృదయమునఁ దోఁచి, పిదపఁ దపింతునాథ!

## ౧౧ అంగవైకల్యము

మధురరీతుల నమృతోపమానమైన
గాన మొలికింతు, నాయింటి కడపయందె,
తద్రసాస్వాదనంబున తన్మయత్వ
మందఁగాలేను బధిరుఁడనై జనించి!

అనయ మేతెంచి, నాగృహాంగణమునందె
తాండవించెద వమల సౌందర్య మొలుక,
పడయనుతదవలోకన భాగ్యగరిమ
కన్ను లేలేని జీవిని గానస్వామి!

గాయకుఁడవంచు, నర్తింపఁగలవటంచు
ఎఱుఁగుదును నేను లోకమే యెఱుకపఱుప
యేమి దోసంబునలిపితి నీ యభాగ్య
గతియు, నంగవైకల్యంబు గలుగనాకు.

## ౧౨ ఊరడింపు

తలలన్ వంచి కృశించిపోయిన ససుల్ తాపంబునొందింప ను
జ్జ్వలగ్రీష్మాతపముం గనుంగొని నిరాశా భగ్న చిత్తంబునన్
కలఁతన్ బొందకుమో కృషీవల, లసత్కాదంబినీ ధ్వానమం
జులమైతోఁచు నభంబు, నీవు ప్రమదాశ్రుల్ రాల్తు వీలోపలన్.

కడచిపోయిన జీవితకాలమందు
ఎన్నిమారులు హృదయ విచ్ఛిన్నగతుల
గాఢనైరాశ్య మొదవెనో, కర్షకా! స
హించుకొనలేదె, భావినాశించి మరల!

ప్రకృతిన్ దివ్యరహస్యముల్ గలవు భావాతీతముల్ కొన్ని, నేఁ
టికి దుస్సాధ్యము రేపు సాధ్యమగు నీడెందంబులో హర్షవీ
చిక లుత్పన్నముగా, కృషిన్ మఱచి యీ చింతాభరంబేల నీ
యకలంకంబగు నాత్మలోఁ గలదు దైవాంశంబె యూహింపుమా.

తోఁవల కంటకంబు లెటులో మొలకెత్తెను నీపొలాన నీ
భావము నిబ్బరించుకొని భావిసుఖంబున, ముండ్లనేరి యీ
త్రోవల కంచె వేయుము, తరుప్రచయంబుల నీడనిద్రలో
నీవు గడింతువే సుఖము నిర్మలముం బొనరింపు జీవికన్.

చాతక పక్షి నల్లడల శ్రావ్యనినాదము సల్పనెంత సం
ప్రీతివహింతువోయి యవనింబడు చల్లని వానచిన్కులన్
కాతరమేల, యేమధుర కాలము వేచెను నీకుఁగాఁగ శో
భాతిశయంబునం బెరుఁగు పైరులు మోదముగూర్చు నీమదిన్.

---

## ౧౩ పడవపదము

పడవనడిపే పాటపాడరా నావికా
కడలజాడల లోతుగానరా నావికా
భయదకల్లోలాలు రేఁగనీ
ప్రళయరావము మ్రోగనీ

బలు తుపానులు వీవనీ
జలజంతువులు త్రోయనీ
పడవనడిపే పాటపాడరా నావికా
కడలజాడల లోతుగానరా నావికా.

పడవనడిపేపాట కడలిదాటేపాట
గలిపి నీ ప్రేమించు గురువు పేరేమి
ఉదయ సంధ్యల ప్రేమ
లూరించు ప్రకృతిలో
హృదయ మోహనగీతి
మృదుమనోహరరీతి
పడవనడిపే పాటపాడుమని ప్రేరేచు
గురువు పేరేమి
నావికా
గురువు పేరేమి

ఓకర్ణ ధారీ
ఓసాగరవిహారీ
దారిచూపే దివ్యతార యేదో నీకు
దూరానగలదోయి చేరవలసిన రేవు
పడవలో నున్నారు నడుమ త్రోవ దిగువారు
ప్రచుర వేగమునాపి పడవ నాపగవలయు
ఓకర్ణ ధారీ
ఓసాగరవిహారీ

## ౧౪ సహవాసకాంక్ష

నిన్ను సృజించె దైవమువ నీస్థలి గాయనిగా నఖండ గ
ర్వోన్నతిబాడుచుందు వమృతోక్తుల రాగరసంబులూర నీ
సన్నిధిజేర్చి దుర్భర విషాదము లెల్ల దొలంగిపోవ నీ
కున్నసుఖం బొసంగి మఱి పొందఁగఁజేయును లోకవృత్తముల్.

పారెడు నీసెలలన్ హృదయ భారమడంపఁగ నిర్జనంబుగా
దూరవనీ నికుంజముల, తోడుగనుండెద నీకు నేను దు
ర్వారములై ప్రశాంతిసుఖ భంగముగొల్పెడు లోకవృత్తముల్
దూరముగాఁగనన్ను దయతో వసియింపఁగనిమ్ము చేరువన్.

గాలిందూగు లతావితానముల నైక్యంబొంది జీవింతునా
నేలన్ రాలిన శుష్కపత్రములలో నేప్రాణముల్ దాతునా
చాలుంజాలు నపార దుఃఖములతో సాగింపఁగాలేను నీ
యాలాపంబె సుఖంబుగూర్చు, చనవిమ్మా నీ యుపాంతంబునన్.

ఏకాంతంబునుగోరు నాహృదయ మింకేనాటికిన్ నీవలెన్
రాకల్ పోకలు నివ్వనీలలిత గర్భంబందె కావింతు నీ
లోకంబందలి వృత్తముల్ మఱచి యాలోకింతు నానందలీ
లాకల్యాణములన్ వనప్రియముగా రాణింతు నిచ్చోటునన్.

కాలాతీతము సేయుదేమొ యనుశంకన్ నామనంబెల్ల ను
య్యాలన్ బోలె చలించుచున్న దమృతం బాసించి జీవించునన్
వాలాయంబు విషప్రపూరముల ముంపన్ లోకవృత్తాంతముల్
జాలింగొల్పదొ నాకథాకథన మీమన్మాత్ర మున్నంబునన్.

కోయని నన్ను బిల్వ మిక కోకిల యెల్ల దురంత వేదనల్
పాయలుగాగ నీవెఱుఁగ రానివిధంబున కన్నుమూసి, నీ
లో, యెలమావి జొంపములలో, శ్రుత పేయరసార్ద్రగీతిలో
నీ యదనన్ వసించెద, లయించెద లోకము విస్మరించెదన్.

## ౧౫. ఉ ప దే శ ము

ఏల వ్యధాభరమ్ములనఁ గృశింపఁగఁ జేసెదు జీవితంబు నీ
రాలిన మొగ్గలున్ సురభిళమ్ములుగా నుదయించి సాంధ్యశో
భాలలితో పహూహాన విభాసురమైనవి, నీ యెడందలో
పోలిచి చూచుకొమ్ము, తలపోయుము నీ బ్రిదుకెంత తియ్యనో,

నీవలె క్రుక్కిపోయి యవ నీస్థలిపై నరవ్రాలియున్న వ
ల్లీవిసరంబుఁ గన్గొని చలింపకు మారయు మవ్వి పాదప
ప్రావృతమై సుఖంపడిన వాసరముల్, ప్రకృతిన్ సమస్తమిా
త్రోవలఁబోవు సౌఖ్యములు దుఃఖములున్ మిళితంబులై చనన్.

వలదు ప్రగాఢశోక పరిపాకము లీనయనాశ్రుబిందువుల్
వలదు ఫలింపఁబోని రస వన్మధుకాంక్షలు హృద్విదారక
మ్ములు గతకాలచింతనలు, మోహానభావిసుఖాభిలాషలున్
వలదు వెటులో తరింపుము విభంగములేని పవిత్రజీవికన్.

## ౧౬. ము క్తి

ఈ యకల్మషహృదయమ్ము, ఈ ప్రగాఢ
రాగభరితమౌ హృదయమ్ము రాత్రి యనను

పవ లనదు వేదనాభారభగ్నమగును
అమలమైన నీప్రేమలో నిముడుకొఱకు.

ఈతమోనిలయంబున నీమహోగ్ర
దుర్నిరాశాలయంబున దుఃఖబాష్ప
నిర్ఝరీనిలయంబున నెల్లప్రొద్దు
నవసిపోయెడు నాకు నెన్నడు విముక్తి ?

పలుకబోనింక, యత్నంబు సలుపలేను
ఇదిగో శుష్కించి పోయిన యీ యెడంద
యకట, నీలోన తన్మయమందిపోవ
వేచియుండెద నేకాంతవీథియందు.

---

## ౧౭. అభాగ్యజీవి

---

ఈవు దయాసమగ్రమతి నిచ్చిన చిన్ని కుటీరసీమలో
దేవ, విశీర్ణభాగములు దీర్చుటకై నను చేవలేని యీ
జీవితమిచ్చి—నాహృదయసీమనె క్రిమ్మర సౌధవాసకాం
క్షావిసరంబు గూర్చితివి కారణమేమి వచింపుమో ప్రభూ!

కరముల్ సాచిన నందఁజేసితివి భిక్షాపాత్రమే యుత్తరో
త్తరవృద్ధింగను జీవితంబని శుభోదంతంబు విన్పించి, యీ
శ్వర హృత్సీమ సువర్ణపాత్రికలనే రూపడ్రసోపేతమౌ
సరసాన్నంపు రుచుల్ దలంచుకొను కాంక్షాబద్ధమై క్రిమ్మరన్.

ఒక శిశువేని సాకఁగల యోగ్యతచాలని యీ యభాగ్యజీ
వికిఁ గలిగింతువేల సెలవిమ్ము దయానిధి కాంక్ష క్రమ్మరన్
కక వికలమ్యె మానస మఖండతర ప్రీతిభాసమగ్రిరీ
తికి, వివరింపుమోయి భవదీయగభీరవిచిత్రమార్గముల్.

## ౧౮. గాఢ యత్నము

ఒక్క చినుకున కాశించి యుర్వియెల్ల
ప్రతినినద మిచ్చు సుకుమారరుతులు సల్పి
ఎంతకాలము గాఢనిరీక్ష చేసె
జలదతతి చూచి వానకోయిల యొకండు !

నవ్యలావణ్యములు చిల్కునలు గాంచి
మధుర మధుపాన కాంక్షమై మఱచిపోయి
క్రూరకంటక పాళులు గ్రుచ్చుకొనగ
జతన మొనరించు భ్రమర మేగతి కృశించె.

ప్రబల గ్రీష్మాతపంబు సైపంగలేదె
వానదెబ్బలు సోక నోర్వంగ లేదె
లేతమొక్కల పొలము పండించుకొఱకు
కర్షకుం డెంత లెంతలు గాసిబొందె.

భూరిసర్పంబు బుసకొట్టు పొదలయందు
ముద్దులొలికెడు గేదంగి మొగ్గచూచి
అందుకొను వాంఛతో నొక యన్యుఁ డుండు
హస్తములు చాచె నెంతటి హానికోర్చి !

## ౧౯. ఇంద్రగోపము

ఓ యింద్రిగోపమా
ఓ నిరాశాఘాత
హృదయ ప్రిబోధమా
నీజీవితపుగాథ
నెఱుగ జెప్పుము నాకు
ఎందుండి నీరాక !
ఎన్ని దినములదాక
ఈదుఃఖమయలోక
మార్గాన నీసాక !
ఓ యింద్రగోపమా
ఆనందదీపమా !
వార్షుకాభ్రముదోచు
వాసరము రాగానె
ఏమిసందేశాన
ఎవరుబంపిరి నిన్ను
ఓ యింద్రగోపమా !
ఓ సాంద్రి తేజమా
మౌనముద్రాధారీ
మరులు గొల్పెద వేమొ
ఉపదేశమిమ్ము నా
యుల్లమే యర్పింతు
ఓ యింద్రగోపమా
ఓ నిరాశాదలిత
హృదయప్రిమోదమా.

## ౨౦. విషాదగీతి

ఓ కవికోకిలా, విడిచి తోఁజగ, మీ యఖిలాంధ్రలోక బా
ధాకులమైన నీమృతికి నశ్రులురాల్చెద నేనుగూడః నీ
లోకమునందు నేను పర లోకనివాసివి నీవు, లేదు మి
త్రా! కనబోలు పుణ్యా ; మెదవ్రయ్యులుగాఁగ విషాద మేర్చెడిన్.

నీ కవితాప్రపంచమున నిల్తు నొకింతుక రామిరెడ్డి, నా
మాకులపాటుదీరి హృదయంబునదోఁచు మహాప్రమోద మే
దో, కలకాల మిల్లె రసతోయధిదేల్తును త్వద్వియోగబా
ధాకలుషంబుగాని యొక తన్మయసిద్ధి వహింతు నేనికన్.

సమయముగాదు నీకిది శ్మశానములో నిదురింప. లెమ్ము, ప్రే
మమున దపించు, నీవనకుమారికి, నూపిరిపోయు ; నీవిషా
దము సహియింపలేని జలదాంగన జూడుము; ఈ కృషీవలుం
డమితవియోగబాధ నకటా! భరియింపగలేఁడు జీవమున్

నీకడ గానరీతులను నేర్చిన కోకిలముల్ వనంబులో
నోకవికోకిలంబ, సరసోక్తుల బాడఁగలేవదేమొ ఆ
శాకమనీయమైన నిమిషంబులలో మధుమాస వేళలో—
ఆకలిదప్పులున్న హృద యవ్యథలగ్గలమైన చోటులన్.

నీకు శ్మశానభూమి రమణీయముగా వటనున్న వారికిన్
శోకరసార్ద్రగీతములు చూఱ లొసంగుచు నుంటివేమొ యీ
లోకమువాసి నీవు నవలోకము జేరినగాని పాడుకో
లేక సుఖింప లేవనుచు రెడ్డికవీశ్వర! నాకు దోఁచెడిన్

పరిచయ మించుకంత గల పాటికె నా హృదయంబు దగ్ధమై
చుఱచుఱలాడి నీకొఱకు సారుబుసారగ నీకవిత్వఫున్
ఝరి నుదయింపఁ జేసినది సంస్మరణంబున నీకు నాకు ని
ర్భరమగు మైత్రి నిల్పినది ప్రాక్తన పుణ్యము శాశ్వతంబుగన్.

కడపటి జీవయాత్ర తృటికాలమె యేబది రెండు వత్సరాల్
పుడమి వసించితో పలుకఁ బూనినచో శతవత్సరంబు లీ
కడ విహరించియున్న నవకం బొలికించెడు నీమనస్సృష్టి యీ
యెడ విడిపోయి యుండునని యెంతయు నఖండముగాఁగ మానసనై.

## ౨౧. ఉగాది వేకువ

మామిడిపూఁతతోన మను మానసపుశోభలు తొంగలింప, శా
ఖామృదుడోల నూఁగుచును గానముసేయ వనప్రియమ్ము లా
రామమె పల్లవించి కళలన్ గురియింపఁగ స్వర్గమట్లు, లీ
లామయ సృష్టిఁగాంచి నుతులన్ బొనరింతు నుగాది వేకువన్.

సురభిళంబైన నింబప్రసూనవితతి
హరితరక్తవర్ణమ్ముల నలరుతలిరు
జొంపములు పాంథజనముల చూడ్కిఁదనిపి
హృదయముల నూతనానంద మొదవఁ జేయు !

పొరిఁబొరి కష్టముల్ దొలఁగిపోవ, నపూర్వములైన సౌఖ్యముల్
బొరసెదమంచు కాంక్షలనుబూని ప్రజల్ భ్రమ నాత్మఁ దేలిపో
యిరి, పరిణామ మెట్టిదొ నిరీక్షణసన్ తలపోయఁజాల మీ
శ్వరుని కృపాస్రవంతి కొనసాగునొ శాంతతరంగశోభలన్.

హృది నైరాశ్యభరంబునఁ గలఁగిపోనీ ఘోరదారిద్ర్యమే
కొదవల్ గూర్పఁగ నాల బిడ్డలును నాక్రోశింపనీ, ధైర్యసం
పద గోల్పోవని మాకృపీవలఁదు భూమాతన్ సమర్చింప, నీ
రదసంతానములాడవే దివిని గర్జామాధురీరీతులన్.

తోలు కారుమేఘములు, చి
న్కులు రాల్చుచుఁ జనుచు నుల్లములం దా
శల గొలిపెదు, నేఫలములు
గలవో యెఱుఁగుదుమె భావికాలమునందున్.

తన సౌందర్యము కప్పివోసిన వసంత శ్రీవిలోకించి ని
ర్జనవాసంబున భావలోలురెద నారాధించుచున్ తన్మయం
బున, నెల్లెత్తి రసార్ద్రగీతికలు సమ్మోదంబునం బల్కి దీ
వన లందింతురు నూతనాబ్ద మొసగూర్పన్ సర్వసౌఖ్యోన్నతుల్.

మరల వాసంతవల్లరుల్, మధురమధుర
కోకిలాలాపములు, చివురాకుగములు,
మరల నవజీవితానంద మగ్నగతులు
స్వాదువనిపించె చిత్రభానూదయమ్ము!

## ౨౨. అ జ్ఞా న ము

తావకీనవినూత్న సౌందర్య మరయ
చివురుటాకుల దెసకుఁ జూచితినిగాని
రాలిపడియున్న శుష్కపత్రములయందు
నీవు దాఁగిపోయిన జాడ లెఱుఁగనైతి.

తావకీనవినూత్న సౌందర్య మరయ
శీతలజ్యోత్స్నలందుఁ జూచితినిగాని
కవిసికొనియున్న కాఱుచీకటులయందు
నీవు సంచార మొనరింప నెఱుఁగనైతి.

తావకీనవినూత్న సౌందర్య మరయ
లలితహర్మ్యము లెక్కి పోఁదలఁతుఁగాని
పేదలకుటీరసీమకుఁ బోదువనుచు
నీ రహస్యవర్తనలెల్ల నెఱుఁగనైతి.

తావకీనవినూత్న సౌందర్య మరయ
ఏవో సుఖమయలోకము లెంతుఁగాని
వాఁగులై పారు దుఃఖబాష్పములయందు
నీవు లీనమైపోవుట యెఱుఁగనైతి.

## ౨౩. అమరత్వము

నిను కవితాతపస్వియని నీకవనంబు తపోవనంబుగా
ననిశము లోకమెల్ల కొని యాడఁగ సృష్టిరహస్యమాధురుల్
కనుఁగొని తన్మయత్వమును కన్నులుమోడ్చెద వెంత ధన్యజీ
వనము లభించె పాడుకొన వయ్యా యథేచ్ఛముగాఁగ నిచ్చటన్.

ఏకాంత జీవితంబున
నీకు సమస్తానుభవము నిత్యానందం;
బాకాంక్షలేల నన్యము ?
కలాల్పముగా సుఖింపు మమలత్వమునన్.

ఒకట లతానికుంజము మఱొక్కట వన్యవిహంగ శాబకం
బొకట ఝరీనినాదము మఱొక్కెడ నిర్మలసాంధ్యరాగ మిం
కొకయెడ సుప్రభాతము మఱొక్కెడ గాఢతమిస్రరాశి తా
వకసుఖసన్నిధాన సహవాసముసల్పె రహస్యభంగులన్.

సౌందర్యార్చనలో సమస్తముగ కాంక్షల్ లీనమైపోవనీ
ఎందాకన్ కవితాతపోవనములోనే కోకిలంబైతి, నీ
డెందంబున్ మధురంబుగా దెరచి సృష్టిన్ ప్రేమపాలించి, "ఆ
నందో బ్రహ్మ" యటంచు దేహము పరిత్యాగంబు గావించెదే?

తపసోద్యమంబు, కరమున
జపమాలిక — అమరజీవి, చాలింపుము నీ
వపువల్లి, భగవదిచ్ఛా
ప్రపూరితము సర్వమాత్మ భావింపు మికన్,

## ౨౪. ముదల

తీవ్రఝంఝానిలము
దెబ్బలకు గూలినది
ప్రావృడంభోధరము
రాపిడికి కూలినది

నాకులాయంబులో
నాకసులు మోడ్పగా
ఋణము లేదేము
నాకింక ఋణము తెగనేమొ!

తడిసినవి ఱెక్కలయ్యో!
దాచుకొన నిక తావులేదయ్యో!
ఆకలంబులు రెచ్చి
అడవిలో గట్టితిని
నాకొంప గూలెనయ్యో!
జీవితము
చీకుపాదమై పోయెనయ్యో!

మతిచెదరి నేనింక
బ్రతుకు చాలింతునా
మరల నొకగూడు, ని
ర్మాణమ్ము గావింతునా
ముదల
దయచేయుమోయీ
నాప్రభూ!
ముదల దయ చేయుమోయీ

---

## ౨౫. అమృతసిద్ధి

అమృతమే వోయుదనుచు పేరాసంబూని
దోసిలొగ్గితి మది పరితోషమొంద
కల్మష మెఱుఁగని నాచిన్ని కరములందు
విషముఁ బోసితి నిర్దయావిలమతిని!

నీవు పరిశుభ్ర హృదయంబు నీసడించి,
విషముకోసమె తునను నిన్ వేఁడుకొంటి
అమృతధారలు గురిసి నా హస్తయుగళి
నిండు కన్నుల నశ్రులు నించితేల ?

ఈ సుధాపానమత్తత హృదయమెల్ల
నవ్యయానంద మాధుర్య మనుభవింప
చావులేని యేలోకమందో వసింతు—
ధన్యమైనది నాజీవితంబు నేఁడు.

సం పూ ర్ణ ము.



# కళాజీవి
## (ఉత్తరఖండము)

---

### 1. వివిక్తవీథి

శాంతి వహించె నీ ప్రకృతి శాద్వలసీమలఁ గాగిలించె నం
తంతల సాంధ్యరక్తిమ విహంగమముల్ కలనాదరీతి రో
దోంతరవీథిఁ బర్వె హృదయమ్మునఁ బ్రేమరసంబు నింపి యే
కాంతతపస్సమాధిఁ బడి కన్నులు మోడ్చెద నేనుసైతమున్.

పరచెన్ ధేనుచయంబు లూరిదెస నంభారావముల్ గొల్పి ని
ర్ఝరిణీస్వాదురసార్ద్రగీతికలె యాశాంతంబులన్ హృద్యమై
పఱతెంచెన్ రమణీయ సుమధురశోభం దాల్చె మిన్నెల్ల నె
వ్వరు లే రీవిమలప్రదేశము తపోభావంబు ప్రేరేచెడిన్.

జననిన్ గానని ధేనువత్సము నిరీక్షల్ సల్పి యెందెందొ యాఁ
కొని దీనారవ మెత్తి పర్వు లిడెడిన్ గోపార్భకుల్ కొండకో
మ్మున నేలల్ వినిపించి శాంతిఁగని గావోదంబు నిండారె ని
ర్జన మీప్రాంతము నాతపస్సునకు ధ్యానాశుద్ధిఁ గల్పించెడిన్.

### 2. కృషి

---

క్షితిని రాలిన తొలకరిచినుకుఁ జూచి
నవ్యముగ క్షేత్రపైరులు నాఁటిపోదు
ఎదిగి, కేదార మెల్ల ఫలించిన ప్రమ
కనులఁ గాంచెడుభాగ్యంబు గలదొ? లేదొ?

అకట ! కాననతరుకుసుమములు వెదకి
శ్రమల కోరిచి, యాశుకశాబకమ్ముఁ
బట్టి తెచ్చి సాకితిఁ జిన్నిపంజరమున
నీఁక లెదిగెడిదాఁక జీవింపఁగలనొ ?

కంటక నికుంజమునఁ జొచ్చి గాసినొంది,
యేరి తెచ్చినసుమముల నెల్లఁ గూర్చి
ఆమెకబరీభరంబున నందపఱచు
కాంక్షఫలియించునో ? మేను గడచిచనునొ ?

---

## 3. శ్రీ అరవిందోపాసన

అరవిందో ! పఱతెమ్ము జీవితరహస్యజ్ఞానమూర్తీ ! వ్యథా
భరమై చీకటిలోనిచిత్తము కృశింపన్ జొచ్చె, నేతెమ్ము, ఈ
విరిదండల్ సమకూర్చి నీకొఱకు నువ్విళ్లూరుచున్నాను, ఓ
యరవిందో ! చిరకాలదర్శన సుఖవ్యామోహమున్ దీర్పవో.

తరుణంబైన వసంతకాలమునఁ జూతం బెక్కి నీయాశ్రమాం
తరభూమిన్ రుతిసల్పుకోకిలము తత్త్వజ్ఞాన చింతార్థియై
యరవిందో యను, పక్షిజాత మట వ్యాఖ్యానింపఁ దద్గీతికా
పరమార్థంబు, వసింపని మ్మచట నీభావంబులో నైక్యమై.

ఋషికులచంద్ర ! నీమధుర వృత్తములో నొక రేణువైన నీ
విషమపరిస్థితిన్ బొసఁలు వేదకు — నాకు ననుగ్రహించి నా
తృష యణఁగింపు మీ యదనఁ దీవ్రతరం బగుత్వద్వియోగపున్
గషణము సైఁపఁజాలని యొకానొక ఖేదమయస్వరూపికిన్.

## 4. సుమమాలిక

నే ననురాగవీచికలు నిండిననాహృదయంబుఁ గూర్చి స్వా
మీ! నవశోభ లొల్కఁ రచియించినయీసుమమాల చేతన్
బూని యలంకరింతు నని పొంగితి నీమెడకోన, నన్యులన్
గానను దాని కర్హుల నకారణరాగరసైకమూర్తులన్.

నీగళసీమలో, వణఁకు నిల్వనినాయిరుగేల నెత్తి నా
థా! గరుపాఱునుల్లమున దామము గూర్చు మహాప్రమోదమే
తీఁగలువారునేని, రసదీప్తి వహించిన జీవితంబులో
యోగివరేణ్యు లొందినమహోన్నతలీలల శాంతిఁ బొందెదన్.

ఆరాధింపఁగ, నేరహస్స్థలము రమ్యంబై ప్రతీక్షించు దే
వా! రాత్రిల్ కనుమోడ్పుఁ గాంచనిమహావస్థల్ సుఖంబయ్యె నీ
పూరేకుల్ వలపించుచున్నయవి రేపో మాపొ త్వద్దర్శన
శ్రీ రాణించుచు నాయుపాంతము కళల్ జీరాడు స్వర్లోకమై.

నా కొకకోర్కె లేదు కరుణామయ! నీభుజపంజరమ్ములో
శోకతరంగితాశ్రువులు సోనలువారఁగ దూఱి, మద్వియో
గాకుల మైనడెందము ప్రగాఢముదంబునఁ దేల మాలికన్
గైకొని వైచిపోయెదను కంఠములోఁ దుదికాంక్ష నాప్రభూ

నాయొనరించుచున్న జతనంబు సమస్తము నిష్ఫలంబుగా
పోయిన — అన్నసంశయము మోసులిడెన్ దొలుదొల్తఁబూలకై
పోయిననాఁడె యాశ పొలివోవక క్రిమ్మర రేకులెత్తె నా
థా! యెటులైన నాబ్రతుకు ధన్య మొనర్పుము స్నేహరాశివై

నే విరిదండ నర్పిచ్చునెడ నీతలపుంజడివాన్కఁ దోఁగ్గెదన్
భావము మాఱి, లేఁజెమట బ్రాకిననాకరయుగ్మకంబునన్
పూవులు జారి జారి పడిపోవును, ప్రేమరసైకవీక్షులన్
జీవులవర్తనంబు లతిచిత్రములై ప్రిమయంబు గూర్చెడిన్.

దేవా! నీకరుణాప్రివాహ మిటురా దేనిన్ కళావీథులన్
జీవింపన్ సులభంబె, యీపృకృతియాశీర్వాదముల్ వోయనా
భావం బెల్ల చిగిర్చి తన్మయతనాపాదించి యానందలీ
లావిన్యాసములోన మైమఱతుఁగాలంబెల్లఁబోఁద్రోయుచున్.

## 5. అఖండస్వాగతము

శ్యామలాంభోధరంబులు చల్లఁగా, ప్ర
శాంతముగ నావరించెడిచదల నెల్ల
తరుణ మేతెంచె జీవితోత్సాహమునకు
ఓబలాకమ, స్వాగత మోయి! నీకు.

శౌర్యవ్యమ్ముగ, భీకరంబుగా సకలదిశల్ను
మాఱుమ్రోగ్రి సెడిగర్జా విరావముల్తకు
సమయ మేతెంచె జీవితోత్సాహమునకు
ఓశిలీంధ్రప్రియ స్వాగతమోయి నీకు.

కనులపండువుగా మనోజ్ఞముగ హృదయ
రంజకమ్ముగ, తటిల్లతాప్రభలు దోఁచె
తరుణ మేతెంచె జీవితోత్సాహమునకు
మొగలిపుష్పమ స్వాగతమోయి నీకు.

భావనోద్వేగముగ, సుధాప్రియముగ, ధ
రాస్థలిని దోఁచె వర్ష ధారాస్వనంబు
సమయ మేతెంచె జీవితోత్సాహమునకు
వానకోయిల ! స్వాగతపథము నీకు.

---

## 6. కాళిదాసు

---

ఆతరుశాఖికాగ్రములయందు నొకానొకవర్ష బిందువై
యాతరుణప్రభాతముల నీవు వెలుంగుచునుందు భూధర
ప్రాంతదవాగ్నికీలల నివాసముసేయుదు, కోకిలాంగనా
గీతికలందు స్వీయమృదుగీతములన్ బలికింతువాక్కుగన్.

సౌందర్యంబున కుబ్బి యాజనపదస్థానంబులన్ ఘోరకాం
తుందంతుల్ శ్రుతి గొల్పి పాడెద వుమఃసంగీతమున్, మేఘపుం
బృందంబై దివి క్రీడసల్పుదు, తపోవీథీవిహారంబు లా
నందబ్రహ్మపథంబున న్నిలుప శాంతాత్ముండవై యొప్పుచున్.

తీయం బౌనవభావగీతికలు పాథేయంబుగా వారిద
చ్ఛాయల్ మోదము గూర్పఁగా పయనముల్ సాగింతు, కైలాసమా
ర్గాయాసంబులు లేవు నీకు సుకవీంద్రా ! రాజహంసల్ నినున్.
సాయంబై వెనువెంట నంటి కొలువన్ స్వాంతంబు నర్తించెనే.

నాశుష్కించిన జీవితంబునకు ప్రాణంబుల్ ప్రసాదించె నా
యాశావల్లరి పూతపూచునటు తోడై నీవచస్సంగతుల్
ఆశీర్వాదము చేయుచున్నయవి నన్నశ్రాంత మోహానో ! కళా
రాశీ ! నీయుపకారముల్ హృదయసామ్రాజ్యంబు పాలించెడిన్.

అల నేరేడువనంబులో నడవిమధ్యన్ మల్లియల్ బూచుకో
వల, నాషాఢపయోదమాలికలలోనన్ స్నేహమాధుర్యముల్
పొలిచెన్ నీకును నాకు, జీవితము సమ్మోదంబునం బొంఁగ చే
తులు మోడ్చెన్ కవిశేఖరా! సతము నీతో నైక్యముం బొందుచున్.

నాహృదయంబు నాఁటిన జనంబు క్రమంబుగ విస్మరించి వ్యా
మోహముఁ ద్రెంచుకొంటిని తమోవలితం బగు జీవితంబులో
నూహలు పెంచుకొంటి సమయోచితభంగుల, మామకీన చే
తోహృత మైన తావకమృదూక్తులు జీవము వోసె క్రిమ్మరన్.

తొడిమల్ రాలినపూవు ధూళిఁబడి యెందో క్రుంగుచుండఁ మనో
జడిమం బూని చరింపఁగా హృదిని సాక్షాత్కారముం బొంది నీ
నుడులం దేదొ ప్రపూర మిడి నన్నుం గ్రోలుమంచున్ కరం
బిడి నాశీర్షమునందు లాలనము సేతే ప్రేమ నిండారఁగన్.

కుములు నెడందతో గనులకుఁ దెరగట్టుచు నున్న శోకబా
ష్పములు వహించి గద్గదరవంబున నేడ్చె శకుంతలావియో
గ మశనిపాతమై యెడఁద కణ్వమహాముని, గాథగట్టె శి
ల్ప మటుల కాళిదాసుఁడు కళామయజీవి స్మరింతు నీయెడన్.

---

# 7. గురూపదేశము

ఈశుపెంచినయాశ లేమిటికి తండ్రి, మారుతోద్ధూతమై
యాశావీధుల రాలిపోయెడిని కాలాంతంబులో నిట్లె యా
నా శోషిల్లిననాదుప్రాణము, నిరాశాశ్రూదకం బెత్తి నా
థా! శోకించెద సృష్టివైఖరుల వ్యంగ్యార్థంబులో నజ్ఞుఁడై.

లోకంబందున నే గురూత్తముల నాలోకించి యీజ్ఞానభి
క్షాకాంక్షాఫలపూర్తిఁ బొందుదు మహాత్మా! నాకుటీరంబులో
నేకాంతంబుగ వేచియుంటిని క్షణం బేతెంచి ప్రేమామ్మయినీ
రాకల్ నాకు మహోపదేశసుఖ సామ్రాజ్యంబు చేకూర్చెడిన్.

చీకటికొంపలో బ్రిదుకు చీలికలైనది స్వామి! యెట్టియు
తేకము లేదు నాకు నుపదేశ మొసంగుము తావకీనప్రే
మాకృతిలోన లీనమగుమార్గముఁ దెల్పి, గురుప్రబోధముల్
శోకము మాన్పి నవ్యతరశోభలు నింపవె జీవితంబులన్.

యాత్ర ముగింపఁజేయుము జోహారు లొనర్చెద చేతు లెత్తి యే
మాత్రము శాంతి లేమివిషమంబయి తోఁచెడుజీవితంబు హృత్
క్షేత్రము దున్ని సల్పినకృషిన్ మొలకెత్తినభావబీజముల్
చిత్రముగా ధరాస్థలి నశించెడి వానలులేమి నాప్రభూ!

ఏయెడ వానకోయిల నదించు సుధామయగాత్రి మెత్తి స్వా
మీ! యొకచిన్కు రాదు నిమేషములో నవమేఘమాలల
య్యో! యనిలాహతిం జెదరి యోసరిలెన్ దెసలందు తీవ్రగ
ర్జాయుతమై నభంబు కొనసాగనియాసలు బెంచువామదిన్.

కోయిలకన్న నే మధురకోమలరీతులఁ బాడుకొందు నా
తీయనిగొంతులోన నురిదీసెను లోకము సైపలేమి నేఁ
జేయున దేమి? స్వామి!, యిరుచేతులు మోడ్చి నమస్కరింతు నా
తీయనిపాటతోడ విరతిం గన నిమ్మిఁక జీవయాత్రయున్.

ఉపదేశింపు గురూత్తమా! హృదయమం దుత్సాహముప్పొంగఁగా
విఫలోర్వీస్థలి శాంతిఁ బొందెద తపస్వింబోలె నాజీవయా

త్ర పవిత్రంబుగ భావగీతికల నారాధింతు లేబ్రుగ్గులం
దపుణ్యాల్లన్ విడనాడి వచ్చి నిజశ్రోత్రప్రీతి నాలింపఁగన్.

---

# 8. ధన్యజీవితము

చదలన్ వార్షుక వారిదోత్కరము లాచ్ఛాదించె, నత్యంతభీ
ప్రదమై తోఁచె నిరమ్మదమ్ములు, జగద్భాండంబు భేదించునా
న్నది నిర్ఘోషము ఘోర మైనప్రళయధ్వానంబునో తెన్, రసా
స్పదమార్గంబునఁ ద్రిప్పుమోయి! హృదయస్థానంబు లోకప్రభూ!

ఆశావీధుల తీవ్రమై విసరుఝుంఝూకీర్ణమై వృక్షశా
ఖాశాఖానిచయంబు లూఁగెను విహంగశ్రేణి కంపింప, నా
వేశించెన్ గగనంబు నాదుహృదయోర్విన్ భావనోన్మత్తకే
కీశోభల్ నటియించుహృద్య మగుతత్కారవారంభముల్.

దెస లెల్లన్ సురభీకరంబులుగ ధాత్రిన్ వర్షబిందూత్కరం
బెసఁగెన్, ధారలు గుమ్మరించెడిని వాహిన్యాకృతుల్ వోయెనీ
వసుధాగర్భములోన వెల్వడి శుభప్రారంభమున్ దెల్పుచున్
రసవద్భేకనినాద మెల్లెడల శ్రోత్రప్రీతి గావించెడిన్.

ఓవిశ్వస్తవనీయ రాగనిధి!, న న్నుజ్జ్వాంత లూఁగించునీ
పావిత్ర్యంబు ఋతుప్రవేశమున నిన్ ప్రార్థింతు నీవర్ష ధా
రావేగంబున రాలునొక్కచినుకై రాణింపనిమ్మోయి. నే
నీవిశ్వంభర కో ప్రయోజనముగా నిక్షేంతు నాజీవికన్.

# 9. శ్రీరాజశేఖర కవిసార్వభౌములు-రాణాప్రతాప

ఆనందంబున రాజశేఖరకవీంద్రా! బాష్పధారాంబువుల్
మానేత్రంబులఁ గ్రమ్ముకొన్నవి. రసార్ద్రంబైన నీకావ్యగీ
తీనాదంబున నేఁ బకొన్నది ధరిత్రీజాత, యేదివ్యశో
భానైర్మల్యము మాహృదంతరములన్ పండించు నేఁ డాకృతిన్.

కవితావేశము పూర్వవైభవసమగ్రస్ఫూర్తి నాధ్యాత్మిక
చ్ఛవి యందందు మహోన్నతంబగుచు నేస్వర్గీయసౌందర్యమో
భువి ప్రాపింపఁగఁజేయు, నీకళ తపోభూమిన్ బ్రవర్ధిల్లె నో
కవిరాట్ఛేఖర, నానమస్సు లివిగో గైకొమ్ము-ప్రేమాంజలుల్.

రణభూమిన్ కడునేత్రపర్వమగుచున్ రాణాప్రతాపావనీ
శునిశౌర్యంబు, పరాక్రమంబు నొకటన్ చూరాడుమా డెందముల్
ఘనమై, వీనులు బ్రద్దలౌ విజయశంఖారావముల్ వింటిమే
దో నవోన్మేషము నీకళాగరిమకున్ తోడై ప్రకాశించెడిన్.

పరభృతగీతికామధురభంగులఁ బోలి, ప్రభాతనిర్ఝరీ
స్వరములఁ బోలి, నీకవిత శ్రావ్యతరంబు గభీరమున్ కళా
భరితము గాఁగ నేరసికపాళి సుఖింపకపోవు? రాజశే
ఖర! కవిసార్వభౌమ!, వెలగ్రక్కెడు నెన్నియొ సృష్టిమర్మముల్.

కమనీయంబయి, పూతమై, హృదయసాంగత్యంబు గావించుకా
వ్యములో దైవము తాండవించు ననుగోప్యం బెన్నఁడాలింపవో,
యమృతానందము దోఁచు నందు, విమలంబై జీవితాధ్యాయము
త్తమమార్గంబున సాఁగు తత్ఫలముగా, తర్కింపు మోసత్కవీ!

ఓకవిసార్వభౌమ, వినియుండుమ్రుగాని తపస్సుతోడ నే
యాఁకలి దీర్చుకోఁగలిగినట్టి మహాత్ముల నట్టితేజమే
నీకు లభింపఁగా జగతి నిద్దుర లేపితి వెంతధన్యమో
యీ!, కళలోని స్వబదుకు—ఈశ్వరసేవ సమగ్ర మందెడిన్.

## 10. ముని వృ త్తి

అంతయుఁ బోవఁగా నిలిచినట్టిది యీపరిశుష్క-జీవిత
ధ్వాంతము మౌనవృత్తి ఫలితంబుగ నేనొనరించుకార్య మా
వంతయు నాకుఁ దోఁపదు, కృపామయ! నీతలపెట్టినతీరొ నే
కాంతమె నీదుచేఁతలకు గర్భితభావము బోధపల్పెడిన్.

ఆజననప్రసాదితమ యైనది యీమునివృత్తి నాకు ని
ర్వ్యాజమ యంచు నెట్లు తలఁపందగు, లౌకికకార్యసాధనో
ద్వేజితభంగులందు ప్రభవించునె శాంతిరసంబు జీవితో
త్తేజము గాఁగ, నీతలఁపులీరుల నేను కరంగిపోయెదన్.

నేను జగంబు వీడి మరణించెదుదాఁకను మౌనదీక్షలో
నే నిలువంగ నిమ్ము, కమనీయము నాకది, హృద్యయమైననీ
ధ్యానము దప్ప నందు సుకృతం బొనరించినజీవి నంచు నా
ప్రాణము ధారవోసెదను పారములేనికృతాజ్ఞతామతిన్.

అంతయుఁ బోవఁగా మిగిలినట్టిది యీపరిశుష్క-జీవిత
ధ్వాంతములో వినూతనవిధానములన్ వెలుఁగొందుగోచు ల
త్యంతము, నామెఱుంగమి వృథా పలవింతును గాని దివ్యవే
దాంతసుఖానుభూతులకు తావల మీమునివృత్తి నాప్రభూ!

## 11. రాయలసీమ

ఏతపస్వి జీవించెనో యీమహోత్కృష్ట
సీమ, పూజ్యమౌ రాయలసీమలోన
నాఁటి ఋషివాటికలశోభ నందపఱచు
ప్రకృతిమాధుర్య మొలుకుమాపల్లెలచట,

కలగీతంబులఁ బక్షు లచటన్ కంఠస్వరం బెత్తి, ని
ర్మలశీతానిలవీచికల్ వలయుచీపాంతంబులన్ భావమం
జులలీలన్ ప్రవహించునిర్ఝరిణు లిచ్చో కొండలం దుండి, రా
యలసీమా! స్మరియింపఁ జేతు వొకదివ్యానంద మేనాఁటిదో,

కవితాగీతిక లల్లి, లోకమున సౌఖ్యం బింక లేదంచు నే
కవి జీవించెనో లేమి దుర్భరముగాఁగన్ సైచి, యీపల్లెలం
దవలోకింపఁగ తత్కళాగరిమ నిద్రల్ వోవు నిచ్చోట మా
నవశ్రేయంబుగ భావికాలమున నైనన్ లేచి వెల్గొందునో!

ఏవీరవతంసమునకు
జీవికగా, విజయమధురచిహ్నముగా లే
దావుల ప్రసరించెనో మా
సేవామందిరము పుణ్యసీమ, రుచిరమై,

రాయలసీమతల్లి! మృదులంబులు నీదగుజోలపాటలన్
హాయిగ నిద్రవోవు భవదర్భకు లర్మిలి కన్ను విచ్చి అ
మ్మా! యని బిల్తు రీవును దయామయదృక్కుల క్షీరధారలం
దీయుము భావికాలశుభదీప్తు లఖండముగాఁగఁ బర్వఁగన్.

## 12. జో హా రు లు

చిగురులు మేసీ
గుబురులఁ గూసే
కోయిలపాటల
తీయఁదనాలకు—
వార్షకాభ్రములు
వంగి కురిసితే
కొండలలోన, కోనలలోన
వరదలుగా వాగులుగా
వాహినిగా ప్రవహించే
సెలపాటలకు—
వేగుజుక్క వెలుఁగులకు
కోడికూఁతసొబగులకు
కళావికాసం కల్పించే
కాపుయువకుని
కపిలెపదాలకు—
చేతులు జోడించీ
జోహారులు గూర్చి
ప్రకృతిదేవీహృదయములోన
పగలూ రాతిరి కలిగించే
బ్రహ్మానందం చిలికించే
భవ్యమైననాకవితాగీతం,
పాడుకొందు నవకవితా గేయం.

## 13. ఉ గా ది

కోమలగాత్రి మెత్తుచు నికుంజము లెల్ల ప్రతిధ్వనింప నే
నేమొ రసార్ద్రభావములనే ప్రకటించెడుకోకిలమ్మ నా
స్వామి! త్వదీయప్రేమరసవైఖరు లే వెలిపుచ్చు, సర్వజి
న్నామశరత్తులో, ప్రకృతి నవ్యకళావళియై హసింపఁగన్.

నీరవమై సమస్తమును నిద్దురవోయెడుజీవితంబులో
నీరమణీయహాసములు నించితివో రసముగ్ధమూర్తి వి,
ప్పారెడు నా యెడంద, ఋణభారము దీర్చుకొనంగ లేమి జో
హారు లొసంగుచున్నయవి హస్తము లీనవవత్సరంబునన్.

సర్వజిత్తు వత్సరంబున
సర్వము సుఖమయముగా ప్రశాంతియుతముగా—
సర్వేశ!, ప్రేమవాహిని
నుర్విని ప్రవహింపఁజేయవోయి! ముదమునన్.

## 14. తృప్తి

నీసుకుమారగానరమణీయతకుం బ్రణమిల్లి బాష్పని
శ్వాసము లుగ్రభేదములు పాసికనినీపరిపూర్ణజీవితో
ల్లాసముఁ జూచి, మ్రొక్కి కనులన్ తుదిమూయుదు నేని యీశ్వ
రోపాసన యేల నాకు బహుళభంగుల తృప్తి వహింతు కర్షకా!

నీకనుచూపువాలికల నిత్యము పెంపు వహించు పైరులన్
రేకులు విచ్చునీశ్వరునిలీల లనంతము గాఁగ, స్వర్గపున్

పోకడలందు నామనసు పోదు కృషీవల, నేఁడు తీవ్రబా
ధాకులమైన నాహృదయమం దమృతద్రవ మూటలూరెడిన్.

ఈకుల్యారమణీయతీరములలో నెందాఁక జీవింతు వం
దాఁకన్ నీకు విహారసౌఖ్యములు సంధానించె దైవంబు, నీ
లోకంబందు పునీతమార్గముల నాలోకించుభాగ్యంబుతో
నాకుం గల్గిన కష్టకా! మృతియు నానందంబుగాఁ జూచెదన్.

స్వేదమయంబుగా నొడలు చేతికొలంది కృషిన్ ముగించి స
మ్మోదముతోడ నాశ్రమము బోలిననీదుకుటీరసీమకున్
బోదువు శాంతిసౌఖ్యములఁ బొందెద వందు ఋషుల్ గడించుపు
ణ్యాదులు లభ్యమయ్యెడు మహత్తరతావకజీవితంబునన్.

---

## 15. కమండలువు

తపము చాలింపుమోయీ!
ఏకాంతవాసివై
యీయరణ్యములోన
ఏకాగ్రతను జెంది
యెంతకాలము గడచి
తపము చాలింపుమోయీ!
నీకోర్కె
సఫలతను జెందెఁ గనుమోయీ
తపము చాలింపుమోయీ!
వాసంతకోకిలము

కూసె మధురమ్ముగా
నీసుధాసమయాన
నీసుకృతి ఫలియించె
తపము చాలింపుమోయీ !
నీతపోవేళలో
నీకు సహవాసియై
నీసేవ యొనరించె
నీకమండలువులో
నెగసె నమృతపుభిక్షలు
తపము చాలింపుమోయీ !
నీకింక
దప్పి దొలఁగిన దాత్మ తఱచి కనవోయీ ?

సంపూర్ణము.



# నా స్వ ధ్వ ము

(పూ ర్వ ఖ ం డ ము)

## 1. ఝ ం ఝా మా రు త ము

శతవర్ష వృద్ధ వృక్షాగ్రశాఖలమునూ
ల్లాస్యకేళీ ప్రవర్తనల విఱిచి
పశుగణగ్రాసార్థ బహుకర్షకసమార్జి
తము గడ్డివాముల భ్రమునకనిపి
అలగృహోన్ముఖ కృషీవల యువతీజన
స్తన మనోహరత ప్రేక్షకులదనిపి
రోదసీకుహర నిర్ముక్తవారుణ రవో
ద్ధతి విశ్వజీవ సంతతిగలంచి

లేచె ఝంఝా నిలంబు వల్లీవితాన
శిథిలహేతువుగా పల్లెసీమలందు
వీచె ఝంఝా నిలంబు కంపితసమస్త
వస్తుభయదంబుగా పల్లెపట్టులందు.

## 2. నా జీ వి త స్వ ర్గ ము

భావమధుర శాశ్వతరసబంధుర గీతికలో
నాజీవితస్వర్గం —

భావశూన్య మఃఖోత్కార బహుధాకంపిత లోకములో
నాజీవిత నరకం —

తరుణారుణకిరణ మనోహర ప్రథమోషస్సులలో
నాజీవితస్వర్గం —
నిబిడతమిస్రా పటాచ్ఛాదిత నీరవ సంధ్యావీథులలో
నాజీవిత నరకం —

అతిహృదయంగమ హావభావమయ వీణాస్వనములలో
నాజీవితస్వర్గం —
భగ్నసమస్త ప్రవిమల తంత్రీమందధ్వానములో
నాజీవిత నరకం —

నిఖిల ప్రాణిహృదంతర బాధానిరసన భావావళిలో
నాజీవితనరకం —
అఖండజగతీ శోభాకారణ పరమేశ్వర సేవాసన్నిధిలో
నాజీవితస్వర్గం —

---

## 3. కావ్యమల్లిక

---

కోకిల మారసాల వనకుంజములో నినదింపజొచ్చె, ను
త్సేకములోన పొంగి వికసించిన నాహృదయంబు నవ్యగీ
తీకమనీ యమార్గముల క్రిమ్మరసాగె నపూర్వ భావనా
లోకము నిల్చెనామెదుట, లోకములన్నియు సంతసింపగన్.

అంతవసంత మారుత సమాగమమ్మైనది. సౌరభంబు ల
త్యంతము వీవసాగె, ప్రమదంబున బొంగిన నాయెడంద, నే
త్రాంతర బాష్పవారి కణికావళియై స్రవియింపసాగె, జ
న్మాంతరవాసనా బలమునందిన యోగియెడందపోలికన్.

తరతరముల్ జగంబులను దన్పియనంతముగాగ సౌఖ్య వి
స్ఫురణము నూలుకొల్పి నవశోభల నీనుచు కావ్యమల్లికా
సురభిళమారుతంబు వొలుచునన్ నలుదిక్కుల నాంధ్రసాహితీ
పరిసర వన్యభూములను పండినయాకుల నల్లరాల్చుచున్.

---

## 4. గీతికలు

కానసుడిగాలి రేగిన, కనులయందు
గ్రమ్ముకొను ధూళిదుడిచెడు కాపువడుచు
పయ్యెదను రెండుచేతులనుబట్టి యెత్తు
ప్రకృతి సౌందర్యమెవని కన్పండువగునో!

ప్రియవిరహ వేదనాభార వివశయగుచు
నామె సెలయేటి తీరమునాశ్రయించె
అలల నిస్వనముల భావనాంతరముల
నర్థమెఱుగంగజాలిన దామెయొకతె.

సారెకీవు శృంగారచేష్టల వెలార్చి
ఏలలోగొనజూచెదవే, లతాంగి
అతడునూని — లౌకిక వాంఛలణచుకొని వి
రాగమార్గములందు పురోగమించె.

ఎంతహృదయం బోసంగి తపించినావు
వాఁడు దక్క నింకొక్కఁడు లేడటంచు
వాఁడు లోకంబువిడిచె — ఈ పల్లెయువకు
లెవరెనీగృహాంగణసీమ నెపుడువిడరు!

---

## 5. గురుపూజ

(శ్రీమాన్ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు గారికి)

గురుజీ, ఎన్నిదినాలకబ్బినది నాకున్ దివ్యసందర్శనం
బరుదై, నేటికి శిష్యవత్సలతనీయం దగ్గలంబయ్యెనో
పరిపూర్ణంబగు భక్తిభావనలు నీపై సిల్పి హృద్వల్లకీ
స్వరమాధుర్యము గ్రోల్తుతావక శుభాశంసల్ ప్రతీక్షించుచున్.

గురుజీ, యెంతటి మోదమిచ్చితివినాకున్ ప్రేమలావణ్య సుం
దరమైయున్నది నీయెడంద విపులోత్సాహంబుతో మున్ను వ
ల్లరిగా బెంచిన కైతనాయెడల పూలక్ బూచి సౌరభ్యబం
ధురమై నీపదసీమ బ్రాకెడువసంతోద్యాన నవ్యప్రభన్.

గురుజీ, ప్రాక్తన పుణ్యసత్ఫలమునాకున్ గల్గనానంద బా
ష్పరుచుల్ రాల్చుమదీయ నేత్రములు మీ సాన్నిధ్యమందున్ మహ
త్తర మీ రమ్యతపోనుభూతి మొలకెత్తన్ జేసినాయందు దు
స్తరమోహంబు తరింపజేసి లోకసంస్కారంబు గావించుచున్.

గురువేదైవము దైవమేగురువుగా ఘోషించు స్వీకార తో
ర్వరధర్మంబులు — చాటిచెప్పిరి మునుల్ రాద్ధాంతముల్ గాగనో
గురుజీ, తన్మయభావమేర్పడియె నాకున్ సాహితీమంజుల
స్ఫురణన్ దాని సమన్వయించుకొని సొంపుల్ దీర్తు నాజీవికన్.

ఒక 'శివతాండవంబ'యి గురూ, తనయంతన పొంగివచ్చు పో
లిక, పరితోషమేదొ కదలించెను నాహృదయాంతరంబు తా
వక మృదుకంఠసీమ చెలువంబగు హారముగ్రిచ్చి వైతునా
సుకృతముపండిపోయె నవశోభల నీనుచు నేటికియ్యెడన్.

ద్రాక్షావల్లరు లల్లుకొన్న పొదరిండ్లన్ తొల్లి పెన్గొండలో
న క్షీణంబుగ సాగిపోయినది కావ్యశ్రేణి, మీరందులో
నిక్షేపంబులుచూపి నేటికిని వాణీసేవగావింప, మీ
'సాక్షాత్కారము' మాకొసంగెను లసత్సందేశమౌ ఘుర్యముల్.

ప్రాచీనంబగు సాహితీపరిచితిన్ వైదుష్యలీలాసుధా
రోచిస్సుల్ సహజోపలభ్యములు మీకౌ, చాటుకావ్యంబు మీ
వాచాశక్తుల లీనమైన యదిశోభావంతమై, శ్రీనివా
సాచార్యా, హృదయంగమంబగు నుపన్యాసంబు గావింపరే.

జలధిన్ నన్నొకనావజేర్చి యికసంచారంబు గావింపు మ
వ్వలితీరంబున కేగుమంటివి, మహోత్పాతంబులన్ గూర్చి యీ
ప్రళయాంభోధితరంగమాలికలు పైపైనన్ను బాధించు నె
వ్వలనన్ గల్గునొయొక్కదీవి గనుపింపన్ జేయరాదో గురూ!

నిముసములోన జొచ్చితిని నీరధిగర్భమునందు, క్రూరదై
వము ననుముంచెనంచు, ననుప్రాణములన్ దరిజేర్చె దైవమే
నిముసములోన, తెచ్చితిని నిర్మల మీ నవరత్నమాల, గో
ప్యముబ్రకటించి నాహృదయభారము నంతమడంపరా గురూ!

# 6. స్వర్గద్వారము

గోహత్యలు చేస్తారా
స్త్రీ హత్యలు చేస్తారా
శిశుహత్యలు చేస్తారా
పశువర్తన నటిస్తారా —

మాకవితా ఖడ్గాలన్నీ
మీకంఠ రుధిరధారాస్వాదనకై
ఘాఘోద్వేగముతో
తహతహ పడుతాయ్.

భరతఖండం భరతఖండం
ధర్మబద్ధం ధర్మబద్ధం —
గోపూజలు చేస్తారా
పతివ్రతల నుతిస్తారా
శిశువుల చుంబిస్తారా
పరమేశ్వరు నర్చిస్తారా

మాకవితామధు పాత్రికలన్నీ
మీకమనీయ హృదంతరసేచనకై
అనురాగోద్వేగముతో
అలమట పడుతాయ్.

భరతఖండం — భరితసౌఖ్యం
పరమస్వర్గ ద్వారతుల్యం —

## 7. ప య న ం

ముసలవ్వా. ఓముసలవ్వా!
ఎప్పుడు — ఈలోకానికి నీరాక
ఎప్పుడు — లోకంవిడిచిపోక —
నీచల్లని గర్భముːలో
పూచిన పువ్వులుగా
కొడుకులతో బిడ్డలతో
కాలముగడిపావా?

మనమలను — మనమరాళ్లను
కనుగవతో చూచావా,
ఎప్పుడు నీపయనం —

వృద్ధాప్యం — అంధత్వం
కళేబరం కన్పిస్తుంది!
జీర్ణశీర్ణ వస్త్రంతో
చేతియూతకఱ్ఱతో
శిధిల శిరోజాలతో
లోకాంత రసీమలకై —
ఎప్పుడు నీపయనం.

కడుగాసిపడిన జీవానికి
పిడికెడు కబళంలేదా,
తిరిపానికి తరిమేశారా
వయసువచ్చిన వారలంతా

యింటినుండి గెంటినారా
ముసలవ్వా — ఎప్పుడు నీపయనం

---

## 8. పూజ

శారదా! రమ్మనేటి పరమత్తమనోహర తావకీనసు
స్మేర ముఖావలోకనము సేసి తరింపగ వేచె నీసభా
స్తారుల కద్వితీయరస తన్మయతన్ గలిగించిపొమ్మ నీ
కారుణికత్వమీ సుతునిగన్న, ప్రవాహముతల్లి యెప్పుడున్.

సుతులందోచెను దైవమాపదలలో క్షోభించె చిత్తంబు, దు
ర్గతిపాలైన మదీయజీవిత కథాంకంబందు నీనర్తనం
బతిలోకంబయి భావనాజగతి నాశ్వాసించె, నాప్రార్థనల్
వితగావింపవు మాసభాసదులకీవే శాశ్వతానందమున్.

రమణీయార్థము నేకశబ్దమున నాలాపింపనద్దాని కా
వ్యముగా నిర్వచనం బొనర్చిరిగదా ప్రాచీనులో యంబ, ఆ
సుమముల్ పూచిన త్రోవలందె నడిపించున్ నన్ను నీప్రేమ నా
కమృత ప్రాప్తి సభాముఖంబునకు సౌఖ్యప్రాప్తి గల్గింపవే.

వివిధరస ప్రవాహపదవీమధురంబగు దివ్యసాహితీ
ప్రవిమలరీతులెల్ల పరిపక్వహృదంతరవీథి గ్రోలి యీ
భువనమునందె స్వర్గసుఖమున్ గనుడంచు రసజ్ఞలోకమున్
కవియొక డర్థిగోరుతుదిగానని రక్తిసభా ముఖంబునన్.

---

## 9. భిక్షువు

కడప కడపకు తిరిగి కనులు మూతలుపడిమె
పల్లె త్రోవలు బట్టి పయనమై పోయితిని —
కలవోలె నీరథము కనుల గోచరమయ్యె
రాజాధిరాజు - యీరాక కే కారణమొ.

రథనేమి నిస్వనము శ్రవణోత్సవము సలిపె
నా వాకిటనె నిల్చె నా స్వామి యరదంబు
నా యాశ లిగురెత్తె
దుర్దినంబులు నాకు తొలగి పోనే పోయె

నీ మనోహర రాగ నిబిడావలోకనము
నిలువెల్ల వర్షించి వెలిగె నద్భుతముగా
భాగ్య రేఖల బ్రదుకు పరిమళించిన దంచు
జీవితాభ్యుదయంబు చేరవచ్చినదంచు
ఆనంద లోకాన
ధ్యానినై నిల్చితిని

పరిహాసపాత్ర మీ బిరుదు రాజులకెల్ల
యాచనా సూచితము హస్త మల్లన సాచి
ఏమి తెచ్చితి నాకు నిచ్చి పొమ్మని పలికె
అయ్యొ, బిచ్చపుకిన్నె యమూల్య భాగంబులో
చేత దడవిన దొరికె చిన్ని ధాన్యపుగింజ
- స్వామి కర్పించితిని

అలమె సంధ్యారోచు లాశాముఖంబులో
దులిపికొంటిని పాత్రి నిలుజేరినంతలో
స్వర్ణాంచితము మెఱయుసాగె ధాన్యపు గింజ
పేడ్చితిని - బిగ్గరగ నేడ్చితిని,
సర్వస్వమును స్వామి సాన్నిధ్యమున జేర్ప
హృదయంబులేని నా బ్రదుకు వ్యర్థం బనుచు
—ఎలుగెత్తి యేడ్చితిని.

( రవీంద్రుని గీతాంజలికి స్వేచ్ఛానువాదము. )

---

# గీతా యోగము

(అనువాదము)

---

అర్జున విషాదము

కృష్ణ, యీ జగతి నాకేమియు వలదు
ప్రహతమై బాంధవ ప్రకరంబదెల్ల
నాదు కన్నుల మ్రోల నటియింప సాగె
కృష్ణ, యీ జగతి నాకేదియు వలదు.

గాండీవమును చేతఁగైసేయఁ జాల
కవచంబు నామేనఁ గప్పుకోఁ జాల
సమరభూతలి పరిసరములయందు
సంచరింపఁగఁజాల, చాలు నో కృష్ణ !

దడపుట్టె నా గుండె దద్దరిల్లెడిని
అవశంబు లగుచుండె నఖిలాంగకములు

ముచ్చెముటలలోన మునిఁగె దేహంబు;
ఇంక సంగరకాంక్ష యేమిటికయ్య ?

అతుల విక్రమము భీష్మాదిత్యుఁ డొరగె
గురువరేణ్యుఁడు ద్రోణ కుంజరుండరిగె
అఖిలావనియుఁ దమసావృతంబ య్యె;
ఈ యరణ్యాపుశోభ మొందుండె కృష్ణ !

పోయినవారలు పోయిరేగాని
బ్రతికిరారైరి యెవ్వరుఁగూడ నింక
సేకరించిన తేనెచిందిన పిదప
ఈ పునరాసక్తి యేల గల్పింతు ?

## ( శ్రీ కృ ష్ణో ప దే శ ము )

సాధువర్తనుల రక్షణ చేయుకొఱకు
పాపాత్ములగు వారిఁ బరిమార్చుకొఱకు
ధర్మసంస్థాపనార్థము పృథాపుత్ర !
యుగ యుగంబుల ధాత్రి నుద్భవించెదను.

వర్ణాశ్రమచ్యుతి వర్ధిల్లు నెపుడు
ఏ నాఁ డధర్మమే యెక్కుడై తోఁచు
మాయ జన్మము నెత్తి మసలు చుండెదను
ఈ లోకమునఁ బార్థ, యెఱుఁగరో నన్ను

ఎవ్వఁడు కర్మలో నెఱుఁగు సత్కర్మ,
సత్కర్మతోడ నసత్కర్మ మెఱుఁగు

అర్హతఁగలుఁగు వాఁడతఁడె, సమస్త
కర్మలు సలిపిన ఘనుఁడు కౌంతేయ !

కామంబు క్రోధంబు కడఁగి వర్జించి
నియతాత్ములై యాత్మ నెఱిఁగినవారు
యతులయి లోకపూజ్యత నందికొనరె
విజయ, బ్రహ్మానంద వివశులై వారు.

నిత్యకర్మల నెల్ల నియతిమై దీర్చి
యెవ్వాఁడు గీతార్థ మెప్డు జపించు
నతఁడె జీవన్ముక్తుఁ డవసానదశను
పరమ పథంబునఁ బడయు సౌఖ్యములు.

కేవలైహిక దుఃఖకీర్ణ చిత్తమున
బాష్పంబు పూరంబు ప్రవహింపజేసి
తను కార్శ్యమునుబొంది తలరగానేల
భావంబు స్వవశత బడయుమో పార్థ!

చిత్తంబు నాయందు జేర్చియెవ్వాఁడు
శ్రద్ధాళువై పనుల్ సలుపుచున్నాఁడో
నాభక్తులందెల్ల నగ్రిగణ్యుండు
నాప్రేమపాత్రుఁడై నను జేరగలఁడు.

కార్యకలాపమ్ము గావింతువేని
సక్తుఁడవై యెప్డు సలుపగాబోకు
సక్తచిత్తుఁడుగాక సలిపినమనుజుఁ
డొక్కఁడే పరమాత్మ నొందగాగలఁడు.

కౌంతేయ, నీచేతగడగడ వడఁకి
గాండీవమిలజారి కనుపింపఁగాఁగ
పరిగతప్రాణమే బంధులోకమ్ము
సమరభూమినిజూచి సంశయించెదవు.

ఎవరికోసంబోయి యిట్టిచంచలత ?
నిష్కామయోగంబు నెఱుకకుదెచ్చి
గళితమైనది ధైర్యకవచంబుగాని
రణభూమిపై జూపు ప్రసరింపు పార్థ !

## 11. శాంతి

లోకమునిన్నుజూచి మదిలోపరిహాసము చేయునంచు వే
బోకల వెఱ్ఱిగాఁగ దలపోయునటంచు విషాద భారమున్
గైకొనబోకు మొక్కత్రుటికాలము రేపటిదాక సైపవే
వో, కనుగొందు వేమిగలదో సఖ శాంతిరసానుభూతిలోన్

దోసెడు దుమ్ముదెచ్చి పడదోసిరి నీతలమీదనంచు నా
యాసపరీత మానసుడవై కలగంబడనేల దీర్ఘని
శ్వాసములేల నీకు, త్రుటిసైపుము రేపటిదాక హారముల్
రాసులుగాఁగదెత్తురను రక్తినిగూర్తురు నీకు కాన్కలన్

పూనఁగనేల బాష్పకణపుంజము నిన్నెడసేసి యున్నత
స్థానమలంకరించిరని సైపుము రేపటిదాక వారలే
కానగవచ్చి నీకడకు క్రమ్మరశీర్షములల్ల నాల్చినీ
యానతిదాల్తురోయి సఖుడా! వహియింపుము శాంతిజీవికన్

(రవీంద్రుని గేయమునకు స్వేచ్ఛానువాదము.)

## 12. శకుంతల

( కాళిదాసున కనువాదము. )

అందంబు కొఱత పడునే
చందురునకు మచ్చయున్న - శైవాలముగ
ప్పందామర పువ్వన - నీ
సుందరియును వల్కలముల సొంపుగులికెడిన్.



## 13. నుతి

( ఆంగ్లమున కనువాదము. )

నీ చరణ సన్నిధికి —
నిరతంబు మా ప్రభుని
దివ్య కవచంబుగాఁ దే జరిల్లిన నీకు—
కృతము విస్మృతి బోని
నుతులతోఁ గై మోడ్పు—

మాకు తోడ్పాటొసగి
మా కొఱకు కష్టించి
మాకు తొందరబొంది
మాకు వేదనబొంది
మాకొఱకు పనిచేసి
మఱుగు పడిపోయితివి

నిరుపమాన ప్రేమ
నిలిపితివి మాయందు

అరవిందయోగి, నీ
యడుగు దమ్ముల మ్రోల
అవనతము శీర్షంబు—
ఆశించి సర్వమ్ము
అఖిలమ్ము యత్నించి
అందు కొనగల్గితివి
అంతయును మాకొఱకు
నీనము ఖంబులో
నిలిచిముగ్ధులమగుచు
నెఱిగింతు మీనుతులు

నిఖిలా వనజ్యోతి
నిన్ను మరువగలేని
నిశ్చలాత్ములమగుచు
నీమ్రోల నీమ్రోల
నీచరణసన్నిధిని
నీహృదయ సన్నిధిని
నిలిచి నుతులర్పించి
ఒక్క నిమ్మనమ్ము, వి
యోగ మోర్వగలేమి
నీకు బుణపడితిమో
నిరుపమానజ్యోతి!
(ఐ గోరీషై హై విషయము ఆంగ్లవచనమున గలదు)

## 14. సంధ్య

కాంక్షలన్నియు మాసి, సుఖమ్ము లంత
రించి, తుదకు దుఃఖము లావరించినట్లు
సాంధ్య కాంతు లల్లిన సమయకొలది
క్రమ్ము చున్నవి కటిక చీకటులు జగతి.

ఆసలన్నియు గూలిపో నార్తి బొరలు
ప్రియులు విరహగీతము లాలపించుగతుల
పాడు కొనుచున్న దల్లదే పరభృతంబు
పరమ సుకుమార సరణుల భావగీతి.

లలిత సంధ్యా విహారంబు సలిపికొనుచు
నూగు చున్నావు భావనా వ్యోమమందు
ప్రకృతి సుఖసాంద్రమో శోకభరితముగనో
కాంచి వివరించుకొనుమోయి కవికుమార

## 15. ప్రకృతిమహిమ

కంపాల తలయందు శాద్వలస్థలులందు
పరిమళమ్ములు జిమ్ము విరులయందు
వన నికుంజములందు వారి దంబులయందు
సరస నాదము లీను తరగలందు
సాంధ్యరాగములందు సైకతంబులయందు
తలలూచు వల్లీమ తల్లులందు

జలధి తీరములందు సాంద్ర చంద్రికలందు
జలజల ప్రవహించు సెలయందు
కొండ కోనలందు కోకిలారవమందు
లలితకాంతులీను తలిరులందు
మరుగు వడిన నీదు మహిమంబు దెలియక
కలతవడిన నన్ను దెలుప వేల

16. తిక్క శర్మ

కన్నతల్లిమున్ను గావించు పున్నెమో
నిన్నుబోలు కొడుకు నెట్లు గాంచు
తల్లి మనసునెంత చల్లగా జేసితో
తెలియ బలుక రాదె తిక్కశర్మ.

పూవు పూవునందు పొరలి పోవుచునున్న
తేనె సేకరించి తెనుగువారి
కెల్ల బంచు నిన్ను నేమని పొగడుదు
తెలుగు నుడుల గనివి తిక్కశర్మ.

భావ మొకటిదోప పద్యంబు దోపదు
పద్యమతుకుకొన్న భావమెగురు
మనసునందుబుట్టు భావంబు పలుకులో
చక్కజూపి తౌర తిక్కశర్మ.

## 17. స్వాగతము

క్రమగతి పాటబాడగా గలనటంచు
కొసరికూయుచు నుంటివో కోకిలంబ
కన్నె గోర్వంక ప్రక్కలో నిన్ను జూచి
పకపకమటంచు నవ్వె నీపాట వినిరొ !

అనుగు చెలికత్తెయే మేలమాడుచుండె
నీదు పాటను విన్నంత, నీకునింక
నిలువ దగదంచు మర్యాద నిలువదంచు
చిలుక పలికెడు పలుకు నీ చెవులబడదొ !!

అల్లనల్ల చెంత కరుదెంచి యరుదెంచి
చెవుల నూదియూది చెప్పుచుండె
తేటికొదమ నీదుపాట తియ్యనిదంచు
నదియు హాస్యమగుట నరయలేవె.

అరయ జాలక నీదు గానామృతమున
చిలుకు మధురిమ యెగతాళి చేయువారె
రమ్ము నాకవితా ప్రపంచమ్ము నందు
నైన స్వాగత మర్పింతునమ్మ నీకు.

## 18. అర్చన

పగలా సూర్యుడు రాత్రి చందురుడు నో పద్మాక్షి నీ లీలలే
గగనంబందున నిల్పిచాలెడిని, నక్షత్రంబులో నేనికన్

పొగడం జాలను నీను వర్ణింపను సంపూర్ణంబుగా జాలను నో
జగదీశా, కనుగొన్నజాలం ప్రకృతిన్ పర్మాణువుం జూడగన్.
పరగన్ చీమల వేనవేలుగ సృజింపన్ జాలి యన్నానికిన్
నిరతాహార మొసంగుచుండు మనుప్ర నే నీకు కారుణ్యమున్
నెరుగన్ జాలమె యందులోన నితరంబేంగా భవత్పుత్రుపై
కురిపింపంగదె సత్కృపారసము నీకున్ నా ప్రణామార్పణల్

## 19. కవీంద్ర

మావికొమ్మల మఱుగున మారుమోగిత
లెగనూగు గొంతెత్తికూయు కోయిల యదేమొ
నావిలాపగీతంబుల ననుకరించు
అతిమనోజ్ఞంబు మధురంబునైన జీవి
తమ్ము గడపితి నొక్క కాలమ్ము నందు.
చెలిమిబిందార భుజమున చేయివైచి
ప్రకృతి కాంతామతల్లి నీ ప్రక్కనిలువ
హృదయమానంద సరసిలో నీదులాడ
ప్రేమసంగీతమును పాడరా కవీంద్ర !

## 20. స్నేహస్మరణము

పరితాప మగ్గలంబై
పొరిపొరి బాష్పములు గ్రమ్మ పూర్ణముగా ని
త్తరిద్రెంచి పోయితే, మన
రకాలపుమైత్రి నేమొనేసితినీకున్.

తెగఁద్రెంపితి నా కోర్కెల
తెగఁద్రెంపి చెలిమి కలిమిఁద్రెంపవి వేలా
వగపునకు తావలంబై
సగముదెగిన ప్రాణమిట్లు సలుపంగనునే.

అనురాగ మొలయఁబెంచిన
జననీ మఱియున్న నింత సంతాపము నీ
కొనగూర్చియున్నె, యాయమ
చనికద నీమొకలికిన్ని శ్రమలుసుట్టెన్.

నిదురయు నాహారంబు
వదలి విపినతలమునందు వాపోయెదొ, నా
హృదయమున నిట్టితలపులు
గదిరిన వికముంచు నాదు గతియేమగునో.

ఒక్కని మేమంబై నను
నక్కట నినుబాయకున్న యనుగుంజెలిపై
నక్కటికమింత లేదో
యెక్కటి దిగనాడిపోవ నెంతటిలోనన్.

---

## 12. ఆశీర్మాలిక

(శ్రీ సుబ్బన్న శతావధాని (పొద్దుటూరు) గారి వివాహ మహోత్సవ సందర్భమున చదువబడినవి)

ఆశావల్లరి పల్లవింప రుచిరంబై నూతనోత్సాహ లీ
లా శైత్యానిల వీచికా వితతులల్లన్ వీవ, ప్రేమామృత

శ్రీశోభా పరిపూర్ణమీ యెడ ఘనశ్రేయంబుఁ గల్పించు దై
వాశీర్వాదము వర్షధారయగు సుబ్బన్నా — సుమంత్రాక్షతల్
మీశీర్షంబులవోసి వేదనినద శ్రీ శ్రోత్ర పర్వంబుగా
ప్రాశస్త్యంబుగ ధర్మబద్ధముగ, దాంపత్య ప్రవృద్ధంబుగా
నాశీర్విధులు మ్రోయఁగా వినిచి మీ యభ్యున్నతిం గోరు వి
ప్రాశీర్వాదము పైఁడిపంట యగు, సుబ్బన్నా — ఋషిప్రోక్తసం
దేశం బందఁగఁ జేసి మీ యెడఁదలుద్దీపింపగాఁ జేసి ని
ర్దేశింపందగు కార్యవర్గముల నిర్దేశంబుగా వించి దీ
క్షాశాంతి ప్రమదంబులన్ గనెడు మార్గంబింత బోధించు వృ
ద్ధాశీర్వాదము పూలవాన యగు సుబ్బన్నా — త్వదాలోక నా
వేశంబీడ్వఁగ వచ్చి లే యెడఁదలన్ విద్యావివేకాది త్వ
త్సౌశీల్యంబున దైవసంఘటన కుత్సాహించి పూర్వాంశసం
కాశం బీ నవవైభవంబనుచుఁ బల్కన్ బంధుమిత్ర ప్రిపూ
తాశీర్వాదము తేనెసోనయగు సుబ్బన్నా — కళారాధనా
లేశం బెన్నఁడు నాదు జీవితముగా శేకెత్తు భావస్ఫుర
త్కౌశల్యం బొక స్వర్గధామము, జగత్కల్యాణ మాశింతు, నా
దేశం బేడనొ సాహితీధరణి కెంతే ప్రీతినే తెంచు నా
యాశీర్వాదము నవ్యకావ్యమగు సుబ్బన్నా — సుహృత్సీమకున్.

కనుదోయిన్ దనియించు వెన్నెల శరత్కాలంబులో నేఁడు సు
బ్బనకుం దోయికి పండు వెన్నెలయె మా పద్మావతీదేవి, యీ
యనురాగాంబుధి పొంగి వీచికలు రావాడన్ మనోవీధి, దీ
వనలందించెద నీవధూవరుల - కేప్రాచీన పుణ్యంబో స
ద్గుణసంపత్తిని సాహితీగరిమలో తుల్ ద్రవ్వోనీజంట, కొ
న్నాళ్లై పూచి మనోజ్ఞ సౌరభము నిండారించు నీయింట, యీ
ప్రణయంబస్ఖలిత ప్రభాపటలియై పండించెడిన్ పంట, పా

వనముల్ దీవనలిత్తు నీజతకు – నోపద్మావతీయంచు, సు
బ్బన, నాథాయని ప్రేమతత్పరత మాపద్మావతీ కాంత మో
హనసంబోధన మాధురుల్ గురియనీ యన్యోన్య దాంపత్యమున్
గని హర్షించుచు ప్రొద్దుటూరి ప్రజలెంకన్ దీవనల్ వోయ ప్రా
క్తన ధర్మోచిత భవ్యమార్గము సమస్తైశ్వర్యముల్ గూర్చు, తీ
యని సేవఫలనిచ్చి చ్చుకొను నేత్రాంతంబులన్ గాలు, ది
వ్యనవీనాంధ్ర సరస్వతీ విపులసేవారక్తి, యీతెన్గు సీ
మనవోన్మేషము బొందుగాక రససామ్రాజ్యమ్మ ఖండంబు దీ
వనలందించెద వీరకిర్వరికుమః ప్రారంభమున్ దెల్పి యొ
య్యన సాంసారిక జననంబునకు నాంద్యాలాపనల్ సల్పి మే
ల్కొనుడంచున్ తొలికోడికూసినది యీగోష్ఠ్యార్థమాలి-ప గా
ననవద్యంబయి భావిజీవితము ధన్యంబౌను, దీర్ఘాయుర
స్థనియాశీః పరిపాకమాలికలు సంధానింతు నేకాకృతిన్.

## 22. నేడుం

అల హర్మ్యాగ్రములందు కేతనము లొయ్యన్ దూల్చుచున్, పేద
కొంపలమీదన్ విజయధ్వజంబు నెలకొల్పన్ జాలి యానంద బా
ష్పలతాంతంబుల వ్రేలగట్టిన మహాసన్యాసి — నాకావ్య వీధుల
సంచారముసేయరా ప్రిబల సంతోషంబు నిండారగన్.

## 23. కష్టేఫలి

గగనోర్వీస్థలి ముద్దులాడెడు పతాకా, నీకు కైమోడ్పు లే
నుగు తొండంబొక జ్ఞానసూచితము, తన్మాత్ర ప్రభారాశి పా
యగజేయుంగద యజ్ఞతాగణము, నీయాశీస్సు, 'కష్టేఫలి'
నిగమోక్తిన్ పచరింపబ్రోవవలె నంతేవాసులన్ మమ్ములన్.

## 24. అక్కమ్మగార్లకొండ

నాసాసుందరమై శిరోజన్మృదు కీర్ణత్వమ్ము సుస్మేర లీ
లాసాంగత్యము సేయు నాననసముల్లాసంబు ప్రేమామృత
శ్రీసంయోగముగల్గు లేబెదవియై స్త్రీమూర్తి బింబింప ను
ద్భాసించున్ నవమోహనాకృతి గిరిప్రాగ్రంబు ప్రాచీదిశన్.

## 25. అంకితగీతి

పలుకులో నిర్మలంబైన తలపులోన
తావకీన కవిత్వసౌందర్యరేఖ
లలముకొనెనేని—ధన్యుడనగుదు నేను
పూత సంస్కృత సాహితీ మూర్తులార

ఓయి వాల్మీకి భాసమయూరకాళి
దాసభవభూతి ప్రేమవిన్యాసమందు
తత్త్వచింతనమున దివ్యతపమునందు
ప్రకటితంబగు మీ కవితకు నమస్సు.

నాకళారాధనమునందు నాతపోవ
న ప్రశాంత జీవితరసానంద మందు
గంగయై పాఱుగాక మీ కావ్యమధువు
నాహృదంత రార్యావర్తనవ్య భూమి.

సమాప్తము.

# వాన్ప్రస్థము

(ఉత్తర ఖండము)

## 1. అద్వైతం

అలరు లేదీవలో—ఇల రాలు నాకులో
అద్వైత సౌందర్య మలముకొని పోయింది
అమృతమయ లావణ్య మాక్రమించెను స్వామి
ఛావు పుట్టువులొక్క చంటిబిడ్డలో యేమొ
ఒక్కటే సౌందర్య మొలుకబోయునో యేమొ

సుఖము దుఃఖము నొక్క సూత్రానగల మణులో
క్రోధ శాంతము లొక్క కోనలో బెళిగినవో
అద్వైత సౌందర్య మాక్రమించెనో స్వామి

అలరుతే దీవలో
ఇలరాలు నాకులో

## 2. సానుభూతి

తరుణము వేచి నీమృదు పదమ్ముల దాపున వ్రాలిపోవ మా
మ్మరమగు కాంక్షతో పయనమైతిని నాదగు రాచబాటలో
పరచినదోయి లోకము నవప్రభలొల్కగ పుష్పమాలికా
త్కరములు స్వామి నాహృదయ తాపము సైపని సానుభూతితో నే

తరుణము వేచి నీమృదు పదమ్ముల దాపున వ్రాలిపోవ ము
మ్మరమగు కాంక్షతో పయనమైతి, విషాద విశీర్ణ పత్రముల్
బిఱబిఱరాల్చి నాహృదయ వీధుల నవ్యవసంతమాధురీ
భరము వెలార్చినీచె తొలివాయువులత్యనుకూలరీతుల్.

తరుణము వేచి నీమృదు పదమ్ముల దాపున వ్రాలిపోవ ము
మ్మరమగు కాంక్షతో పయనమైతిని నాహృదయంబులో యథా
భరము సహింపనోపని కృపామయి కోకిల బాలపంచమ
స్వరమున నాలపించినది చల్లని పాటల నాదుతోవలోన్.

## 3 జ ల ద పు త్రు డు

జలదమా, కొండరాళ్ళ నూసరధరిత్రి
గుర్తిమ్మరించెద వేమి సౌఖ్యమ్ము నీకు
రమ్ము సుకుమార లలితక్షేత్రములు గలవు
హృదయము దవివింప నిచట వర్షింపుమోయి.

నీవురాల్చిన చినుకుతో భావమెల్ల
కలిగి, కళకళలాడు మొగమ్ములెత్తి
శాలి భూములు విమల రసైకమూర్తు
లల్ల స్వాగతమిడు నీకునంబుదంబ.

శిలలెరుగలేవు మెఱపుతీగెల సొబంగు
నీగభీర ధ్వనుల రామణీయకంబు
ఇచట వనులెల్ల నిన్ను కేలెత్తి పిలుచు
రమ్ము సౌహార్ద్ర మధుర సౌఖ్యమ్ము గనెదు.

నీరద కుమార, చెఱువులు నీరు లేమి
ఎండి బీటలు వారిన వెల్లయెడల
అమృత ధారలు గురిసి నీయార్ద్ర
భావము వెలార్పవలయు నీతోవలందు.

తావ నీళులుగానక తల్లడిల్ల
అల విహంగము లెంత దైన్యము వెలార్చు
ఇచట తుంపురుల్ జల్లి నీ వేగుమోయి
కలదవలి జన్మ పుణ్యలోకంబు నీకు.

జలధరకుమార గిరితటాంచలము లందు
చాలువర్షింప, నిష్ప్రయోజనము నీకు
అతి పిపాసలగుంగి నోరారవిచ్చు
జీవకోటులు దనియవర్షింపుమోయి

## 4. స్మ ర ణ వీ థి

రాలినదాస్యకీయ తరళద్యుతులన్ వెదజల్లి యాకసం
జేలిన తార పాట విరమించినదా, వనమెల్ల దివ్యగీ
తీ లలితమ్ముగా కలయ దిమ్మరకోయిలనవ్య సౌరభ
శ్రీల నికుంజమెల్ల నలరించిన పూవు కృశించె నాథరన్ ?

## 5. ఆ హ్వా న ము

ఓ మహాత్మా రమ్మా
ఉర్వరకు దిగిరమ్మా,

స్వాతంత్ర్య దినమహోత్సవ లీల దిలకింప
పూతతావక హృదయ పుష్పమ్ము పులకింప
సాధు పుంగవ రమ్ము
సత్వరమయే తెమ్ము,
మూడేండ్ల వయసులో ముద్దుబిడ్డనుజూడ
పాడిపొమ్మొక జోలపాట హర్షముతోడ—

కర్మయోగీ రమ్ము
కర్మ భూమికి రమ్ము,
భారతాభ్యుదయ సంభ్రమములో పాల్గొను
కారుణ్యమయగీతిగా వీధిమోర్కొందు—

బాపుజీ చనుదెమ్ము
ప్రజల కోసము రమ్ము,
స్వాతంత్ర్య కేతనజ్యోతి నాలోకింప
"గీతారహస్య సంగీతమ్ము బోధింప"

ఓ మహాత్మా రమ్ము
ఉర్వరకు దిగిరమ్ము

---

## 6. కుందమాల

(మిత్రులు శ్రీ బులుసు వెంకటేశ్వరులుగారి అనువాదము చదివి)

అలగీర్వాణ సరస్వతీ హృదయ మందానంద లీలాయశః
కలితంబైనది కుందమాల, వెలయుంగా ఆంధ్రసార స్వతో
జ్జ్వల నవ్యోపవనీ మరందరస దివ్యశ్రీలగా హృద్యమై
లలితంబైన త్వదీయ శైలియమృత ప్రాయంబుగా దోపగన్.

"హృదయాహ్లాదిని కుందమాల" యని మీ రేపల్కినా రొక్కచో
నదిసత్యంబని యెంతు, లేని యెడ నేలాబాష్ప సంకీర్ణమై
పొదలున్ నానయన ద్వయంబు నిముసం బూహింపనే తత్కథా
భ్యుదయంబున్, రసవత్తరంబులగు నోహో! కల్పనా చాతురుల్.

అలదిజ్ఞాగుని కవితా
విలసత్సుకుమార ఫణితి విరిసరు లాంధ్రో
క్తుల వెలయించిన మీ శ్రమ
ఫలమింగల్పించె వేంకటేశ్వర సుకవీ.

వెనుకన్ మీకృతులన్ పఠించి హృదయోర్విన్ కొంతయానంద భా
వనలో దేల్చితి నెన్నియో సుగుణముల్ ప్రాపించు నీకుందమా
ల, ననుంతన్మయ మొందజేసినది "యీరత్నంబ మూల్యంబు" నా
యనుఁగుంనెచ్చెలి వేంకటేశ్వర కవీ యర్పింతు కేలోడ్పులన్

---

## 7. సాన్నిధ్యము

---

నీ సన్నిధిలో పాడుదునా
నీ కొఱకే పాడుదునా

నిరుపమాన లలితమధుర నిర్మల సుకుమారగీతి

నీ సన్నిధిలో పాడుదునా
నీ కొఱకే పాడుదునా

తెరలు తెరలై లేచి
పరతెంచునా పాట
హృదయ కుహరములోన
నొదిగియుండగ లేదు
నీ సన్నిధిలో పాడుగునా
నీ కొఱకే పాడుదునా

గిరి నిర్ఝరము వోలె
పొరలి పొంగేపాట
తలపు తెరమఱుగులో
దాగి యుండగ లేదు
నీ సన్నిధిలో పాడుదునా
నీ కొఱకే పాడుదునా.

భావ బంధురముగా
ప్రవహించు నాపాట
అంతరంగము లోన
నణగి యుండగ లేదు
నీ సన్నిధిలో పాడుదునా
నీ కొఱకే పాడుదునా
నిరుపమాన లలితమధుర నిర్మలసుకుమారగీతి
పరమ శోకభయ విదళన పరిణత సుమనోజ్ఞ గీతి.

రాలిన పూవులన్ గని పరాఙ్ముఖుడైతిని చాలుజాలు నీ
లీలలు నాప్రభూ, యమృతలిప్త కరమ్మును జూపినావు నీ

హాలహాలమ్ము ద్రావితివి యారిన గొంతుకగాన నీవిష
జ్వాలలె మ్రింగినావైతు మధుసారము వోలె నఖండతృప్తితోన్.

పాడకుమీ ప్రభాతమున పాడకు కోకిల—నీదుపాటలో
వాడి కృపాణ వర్గములు వ్రచ్చెడు నాహృదయంబు, పుత్రునిన్
బూడిదపైచి నేశిశిరముం గనుచుంటిని జీవితంబులో
పాడకు మీ ప్రభాతమున పాడకు కోకిల ప్రేమగీతమున్.

ఏకైక పుత్ర విరహ
వ్యాకుల భావంబుతో నిరాశ్రయ భావ
వ్యాకీర్ణమయ్యె జీవిత
మాకలి దహియించు హృదయ మత్యంతంబున్.

ఎక్కడలువచ్చి యీతరువులెల్ల నడాడెడు పక్షిపిల్ల నా
పక్కబరుండియే సుఖతరంగిణు లీదినబిడ్డ, నాయనా
యెక్కడ బోయితయ్య రచియించెద నీ కయిభావగీతికల్
పెక్కులు భారమా హృదయవేదన దూయగ శాశ్వతంబుగన్.

లెమ్మా నక్కవిశేఖరా, వ్యసనమాలిన్యంబు బోద్రోచి కా
వ్యమ్ముల్ గూర్పగ నుద్యమించి మధుర వ్యాహార లీలన్ రసా
ర్ద్రిమ్మయి లోకము ముగ్ధమానటుల నాలాపింపు మీదివ్య గీ
తమ్మా నందమయ ప్రపంచమున బాధాశాంతి గావించెడిన్

కలుషము — జీవితోజ్వల ముఖంబున నాకిక శాంతిలేదు సం
జలగనిపించు రక్తిమపసన్ క్షణకాలమె సౌఖ్యమెల్లసం
జరులు ఘటించి స్వామికడసాగిలి మ్రొక్కెద—కావ్యగీతిలో
కలదు చిరప్రమోదరస ఖండము—దానినెపాడి పోయెదన్.

ఈ విపులాబ్ధిమధ్యమున నేను భయంపడ ఘోరమారుతా
రావములం గలంగబడి ప్రాణమువాయెను గమ్యమైన నా
రేవు లభించుదాక బెదరింపులుసైచుచు కావ్యగీతి కా
నావగమింతు నాదు పయనమ్మనుకూలము సేయు దైవమున్.

కనుగొనుమిూ విశాలవనగర్భములోపల నెన్నిపూలు పూ
చినవొ మరెన్ని పూయక నశించినవొ జగతీ రహస్యముల్
కనుగొని పాడుకొందు చిరకాలమునేనిక కావ్యగీతిలో
మనసు ప్రశాంతమై సుకృతమార్గమునన్ పయనించునన్యమై.

రాకలుపోకలే నెఱుగరానివి శూన్యగుహాంతరాళ ఘూ
రాకృతితోడ భగ్నహృదయంబున కుంగెద, నీశ్వరుండు తా
నైకనవచ్చి నాకభయహస్తమునిచ్చును కావ్యగీతి కా
కోకిల గానమాధురులకున్ మనసిచ్చి తరించిపోయెదన్.

హృదయముపండజేసి రుచులీనగజేసెను ప్రేమగీతి—నా
సదమల శాశ్వతానుభవ సారసుధామయ కావ్యగీతి మిా
పెదవిగదల్చి పాడుకొని విశ్వమునే పులకింపజేతునా
కొదవిన భాగ్యమంచు సమితోన్నతసీమల సంచరించుచున్.

నిను రామచిలుక పోలిక
ననయంబును బాహుపంజరాంతర సీమన్
బెనిచితిని గాన శోకము
మన మవశముగాగ రశిలిమాన్చును పుత్రా.

లేకుండబోతి వీవీ
లోకంబున మధురమధురలోలుప మతినై

నీకై పాలవించుచు మి
థ్యాకల్పిత జగతి ప్రాకులాడెద పుత్రా.

నీగుణ కీర్తనముననే
దోగెద నానందగతి మధూదయ భూమిన్
తూగెదు నున్మాదభరా
వేగము సర్వంబునాకు ప్రియమో పుత్రా

జీవితము మహాప్రళయము
లో వేదనబొంది, తుదకు లోకాంతర వీ
థీవిలసన్మతియగు నీ
తో వసియించునె ప్రశాంతిదొరకునె పుత్రా,

మరణ పరివర్తనంబున
పరలోకగతుండవై యుపాసింతువు సు
స్థిరశాంతి నీదుకాంతా
పరిణామఫలంబు చిరతపస్సున పుత్రా.

## 8. చిఱుపాట

మునుపు వసంత కాలమున మోహన గీతికలల్లుకొంటి, కో
యనె నొక కోకిలమ్మ హృదయంగమరీతుల— మెచ్చుకోలుగా
మనమున బొంగిపోతి మధుమాసమె క్రమ్మర వచ్చెగాని నా
మునుపటి పాటయే మఱచిపోయితి స్వామి క్రమక్రమంబుగన్.

మఱచి స్మరించితిన్ నిమిషమాత్రములో స్ఫురియించె త్వత్కృపా
భరమున సర్వమున్. పరమపావనమై, ద్విగుణీకృతంబుగా

పరవశభంగినా మధు రభావము పొందుచు నే నవీన వై
ఖరి నుపదేశ మిచ్చెద సగర్భితమై జగమ్ము సోలగన్.

మునిజనవాస మియ్యది, తపోవనభూమి స్వతంత్రభారతా
వనికి శుభోదయంబనుచు పాడిన నాదిఋపాట నీకృపా
యన మొనరించు కొందును నవాకృతితో పరతెమ్ము మద్గృహాం
గణమునకో ప్రభూ పిలుపు కర్ణరసాయన లీలగ్రాలగన్.

---

## 9. భావ కుసుమములు

(శ్రీ) బులుసు వెంకటేశ్వర్లు గారి యింట జరిగిన ఒక వివాహ సందర్భమున
వ్రాసిపంపబడిన పద్యములు.)

---

సిరులు శుభాశిషంబులును జేర్చి హృదంతరవీధిమోదీ సం
భరితముగా— తపోధనుల ప్రాక్తనజీవితముల్ ధ్వనింపగా
పరభృతగీతికా మృదులభంగి మనోహర వేద వాఙ్మయ
స్వరములు నూత్నదంపతులపై ప్రవహించెనుగాత మేనులై

అలమఘుమాన రోచుల సముచిత గ్రీష్మసమగ్ర దీప్తిలో
జలద వినూతనద్యుతుల శారదకౌముదిలో, హిమంపు శో
భల శిశిరంబులోన పరిపక్వములై ఋతుధర్మముల్ మనం
బులు పులకింప దీవనలువోయునుగాత చిరంబువీరిపై

మ్రోగగన్ మంగళవాద్యఘోషము మహామోదంబుగా మేళనం
బై గంభీరముగాగ వేదమంత్రధ్యానంబు వైవాహిక
శ్రీగై సేసిన మీనికేతనముతో రేకెత్తి దివ్యప్రభల్
తీగల్ వారునుగాత విశ్వేశ్వరకృపారీతుల్ ప్రవర్షింపగన్.

---

## 10. ఉపాయనము

(మిత్రులు శ్రీ పుట్టపర్తిగారికి- అనంతపురములో వీడ్కోలు సందర్భమున)

తీయనిదో విషాదరస దీప్తివహించిన దేమొ జీవితా
ధ్యాయములో రహస్యములు దాపక జెప్పితి రెండుమూడు నా
ళ్లాయె సఖా ప్రయాణమిక నాపగరానిది నీకు పోయి రా
వోయి, నమస్కృతుల్, మఱచిపోక సుహృజ్జను లాప్తబంధులన్.

హాయిగ నా "తెనాలి" కవితాకృతిజెప్పితి, కాళిదాసులో
నీయను భూతి నెల్ల రమణీయత బల్కితి కావ్యమర్మమం
దీయగ సర్వతోముఖమతిన్ కృషిసల్పితి వింకపోయి రా
వోయి నమస్కృతుల్ మఱచిపోక సుహృజ్జను లాప్తబంధులన్

ఏయుగమో తపోవనులనే బ్రతికించినదంచు పూర్వమా
కోయిలపాట కొన్నదొక కోమలగీతమటంచు మున్ను రా
మాయణ కావ్యమాధురుల మగ్నత గొల్పితి వింకపోయి రా
వోయి నమస్కృతుల్ మఱచిపోక సుహృజ్జను లాప్తబంధులన్.

నా యెదనే స్ఫురించె కరుణమ్ముగ నీ పరితాపమెల్ల, నా
రాయణ నీ తపోనియతులన్ ప్రభవించిన "దగ్నివీణ" పా
రాయణ సేయు నీ జగము రాకలు మానకుమింక పోయి రా
వోయి నమస్కృతుల్ మఱచిపోక సుహృజ్జను లాప్తబంధులన్.

## 11. ముక్తాదామము

గరళము త్రావి త్రావి కఱకైనది కంఠము శోకగీతికా
భరమె స్రవించు నందు, నెడబాటులుగల్గి కృశించిపోయె వె

ప్పరుసునఁ గోలుకొందు తుదివందనమో ప్రభూ!, తావకీన సం
స్మరణ సుఖంబుతో మరణసౌఖ్యముఁ గూర్పుము నాకు హాయిగన్.

పోయెన నీప్రసంగమును మోదముతోఁ ద్యజియించి, నీదు కం
దోయికిఁ గానరాక నను దుర్భరదుఃఖమునందుఁ ద్రోసి నా
తీయని భావవీధి కుఱితీసినస్వప్నతుకు చన్నత్రోవలో
నే యిఁక రాను తండ్రి! కురియింపుము దీవెన లొక్క వ్రేల్మిడిన్.

సకలసుఖస్మృతులన్ మఱచి సాకిన మాహృదయంబులందు ని
ప్పుకలు రవిల్చి రాగరసపూరితవిశ్వము మిథ్యగా—రసా
త్మకమగు జ్ఞానలోకమున ద్వారముఁ దీసి, రహస్యభంగి దై
వికముగ జాఱిపోయె నరవిందకుమారుఁడు మార్గదర్శియై.

పరమగురూ, హృదంతర మపారమహోగ్ర విషాదభావనా
తురతఁ దపించుచున్నయది త్రోవలులేని యభాగ్యజీవి వా
తెర నమృతద్రవంబు చవి తీయదనంబునఁ దన్పుమోయి! నా
కరములు మోడ్చునొక్క స్మృతికావ్యము నీకు బహూకరించుచున్.

ఈ విరహాశ్రుజాలముల నేరి, మనోహరరీతి నొక్కము
క్తావిసరంబుఁ గట్టితివి తావకకంఠ మలంకరింతు నో
పావనమూర్తి!, నే నొకతపస్విని నీవిరహాగ్నిలో, కళా
జీవిని నీ చిరప్రణయచింతనలో విధిసిద్ధ యంబునన్.

ఇంత నిరాశతోఁ బలవరింతునుగాని, విధిప్రియుక్త సి
ద్ధాంతము లెట్టివో, యెఱుక దప్పనియామహనీయు లొక్క వే
దాంతులెగాక యెవ్వరికిఁ దత్త్వనిమీాషకుఁ జాలువార లా
ద్యంతము శోకభారమున కాస్పదమాయని జీవితంబులన్.

ప్రాణంబుల్ విరమించునప్పుడు కుమారా! మేఘనిర్ఘోషముల్
వీనుల్ బ్రిద్దలుచేసె, గాఢతమముల్ విశ్వాధి నిండారె, నా
లోనన్ దోఁచె భయంకరాకృతులు మార్మ్రోగించె దిగ్వ్యాఘులన్
శ్రేణుల్ గట్టిన వానకోయిలలు సారెన్ స్వీయ కంఠధ్వనుల్,

నాయుదరంబునన్ సుతుఁడవై జనియించినయొక్క యోగివే
మో! యరవిందపుత్త్రి! ననుఁబూని పరీక్షలుసల్ప మన్గృహ
చ్ఛాయలలోఁ జరించితివి చాటుననున్న రహస్యమర్థమై
పోయినదింక నామనసు శోకదలే యొక భంగిమాఱెడిన్.

అమ్మా! నాయన! యన్నమాటలు త్వదీయాస్యమ్మునందుండి
త్రమ్మల్ మోడ్చెడువేళ వెల్వడిమె పుత్రా!, భావనావీథిలో
మమ్మున్ దుఃఖనిమగ్నులన్ జలువు ప్రేమస్నిగ్ధముల్ గాఁగ దూ
రమ్మై పోయితి వీధరాస్థలిని భారం బోయి! మాజీవముల్.

ఆనందంబు నశించిపోయినది బిడ్డా!, జీవితంబెల్ల నే
వో నైరాశ్యమునందు మున్గినది, నాదుఃఖంబు ఘోరంబుగా
కానల్ పాలగునో కవిత్వము, తుదిన్ గావ్యార్పణల్ సల్పనీ
వైతే, నేనింక ప్రశాంతిఁ బొందెద సమగ్రంబొంద నాయాత్రయున్.

అధరముఁ జేర్చితోయి! యమృతాసవ మంచు క్షణంబులోన నె
వ్విధమున మాఱిపోయి విషవీచిక లుద్భవమయ్యె నందు నీ
విధి చెయిదంబులన్ హృదయవీథులలోన సమన్వయింపుమో
మధురకవీ! తృషార్తులకు మార్గముఁ జూపుచు శాంతి గూరఁగన్.

సడలిన రేకు లెల్ల నొకచాయకుఁ జెచ్చి లతాంతసృష్టికై
పడెదు వృథాశ్రమంబు హృదిభార మడంపగ లేని వెఱ్ఱి పో

కడ లివి నూను మోయిం!, రసగర్భితగాన మొనర్చి లోకనా
థుఁడు ప్రసరించులీలల యథోచితభంగులఁజాటి పొమ్మికన్.

ఆనందమ్మున సృష్టిమాధురులు నీ కాహ్వానముల్ సల్పె నీ
వీనై రాశ్య విషాదభావములలోనే కుంగిపోనేల? నీ
లోనన్ లాన మొనస్పునీశ్వరుని నాలోకించి నీవీణలో
నే నవ్యస్వర సు ప్రుతిల్లినదో నీహృద్వీధి నూహింప్రమా.

పారెడినిర్ఝరీ మృదురవంబులలో నవసాంధ్య రాగవీ
చీరమణీయవై ఖరులస్నేహములో నిమిడింపుమోయి! నీ
తీరనికాంక్ష లెల్ల నొకతీయదనంబున రేకులెత్తు నీ
తీరము జేరవచ్చె గడతేరుచు వచ్చె సముద్రియానమున్.

నీకవితాపరివాహ మువనీస్థలి హద్దులు దాటిపోయె నీ
లోకమె వేఱు, నీమనసులో గలయూహాలె వేఱు, ఒక్కబా
హ్యాకృతి యొక్క కావ్య మయి పల్కిన నీయిహలోకయాత్రలో
నీకను లల్లమూయు మిక నిశ్చలభంగి తపోవనంబునన్.

---

## 12. సారస్వతేయులకు కృతజ్ఞత.

నాదు తావకాశీస్సు ధానవ్యవర్ష
ధార గురిసిపోఁజెరిగిన తలిరుదీవ
నాదు కవితాకుమారి, యీనాటి కిదిగొ
పూర్ణయౌవన లావణ్యములు చొలంక

సహజ లజ్జావిలాసముల్ సంచలింప
మీ యెడ కృతజ్ఞతన్ దెల్ప మీ దుదర్శ

నార్థమే తెంచి తిలకింపు డార్ద్రిహృదిని
పల్లెలో బుట్టి పెరిగిన పడతి గాన

మధుర వాక్సరంపరలతో మనసునలర
జేయునో లేదో, తనదు హృత్సీమనెల్ల
నిర్మల ప్రేమభావనే నిండికొనగ
మీయెడ కృతజ్ఞతన్ దెల్ప మీదుదర్శ

నార్థమే తెంచె తిలకింపు డార్ద్రిహృదిని
ఎంత రసభరితమొ, తనకెంత ప్రియమొ
స్వీయజీవిత గాధావిశేషములనె
చెప్పికొను నీమె, శాద్వల సీమలనుచు

సైకత ప్రదేశములు నిర్ఝరిణు లనుచు
కలవరించెడు నీమె నేమె కారణంబొ
మీయెడ కృతజ్ఞతన్ దెల్ప మీదుదర్శ
నార్థమే తెంచె తిలకింపు డార్ద్రిహృదిని

## 13. నిర్యాణానంతరము

ఈ భరత భూమిలో
నీవు నాటిన పైరు
నిలువునా పెరిగింది
నేత్ర పర్వంబుగా

కర్మ కోత్తమ నీవు
కదలి పోయిన పిదప—

ఈ యరణ్యాంబులో
యేకాగ్రతను జెంది
నీవు సలిపిన తపము
భావ ములరించింది

తాపసోత్తమ నీవు
తరలి పోయిన పిదప —

ఏకాంత వీధిలో
హృదయ వేదనకోర్చి
నీవు పాడినపాట
నిండినది జగమెల్ల

కవి కులోత్తమ నీవు
కడపదాటిన పిదప—

## 14. కవితపస్వి

పరిపూర్ణ జ్ఞానంబున
పరిపూర్ణానంద రేఖ బ్రదుకెల్ల మనో
హరమై యొక జపమాలా
పరమ స్నేహమున కవితపస్వి సుఖించున్.

ఏకాంత వాసమున ప్రే
మాకృతి బొలుపొందు సృష్టి మంజులభావ
శ్రీకలితుడగుచు కవితా
పాకంబున బడిన కవిత పస్వి సుఖించున్.

నేత్రములుమోడ్చి హృద్గయు
క్షేత్రము నాధ్యాత్మికమౌన గీల్కొలిపి ఘరా
యాత్రా సుకృతంబున తా
పత్రియమున్ విడిచి కవి తపస్వి సుఖించున్.

## 15. నందన

ఎందాక నీపాట
హృద్యమై ప్రాకింది
కోయిలా
మాధుర్య మందులో
మగ్నమైనందుకా?

ఎందాక నీకీర్తి
లెగబ్రాకి పోయినది
మావి మొగా
పరిమళము నీనుండి
ప్రసరించినందుకా ?

ఎందాక నీపేరు
ఇలమారు మ్రోగింది
నందనా
సుగుణంబు నీలోన
చూపట్టినందుకా ?

# స్వర్గద్వారము

(పూర్వఖండము)

## 1 ఆంధ్రమాత

నిరీక్షించితి నా హృదంతరములో నీ తేజ మిన్నాళ్ళుగా
సాక్షాత్కారము నొంద నేను తొలియాశావల్లరుల్ పూచె, మా
కక్షీణంబులు తావకీన కరుణాకల్లోలి నీ ధ్యానముల్
ప్రక్షాళింపవె మా మనోమలిన మంబా, ఆంధ్ర తేజస్వినీ!

మాతా, సుందరభావ మందిరములన్ మాయున్కి సుస్వాగతో
పేతంబై మృదుకంఠమెత్తినిను సంప్రీతిన్ సమర్చింతు మా
ప్రాతశ్శోభలు సస్మితాసనముపై ప్రాకన్ శుభాశీస్సుధా
పూతంబౌ కరమెత్తుమింక కవు లామోదింప నాంధ్రావనిన్.

తల్లీ, రాయలసీమపల్లియల నాంధ్రత్వంబె రాపాడు, రే
ల్లెల్లన్ విందురు తందనానపదముల్ విన్పింప, పల్నాటి వీ
రోల్లాసంబుల కావు దంపతులు, బాష్పోద్వేగులై పోదురే
తల్లీ లామయ జీవితంబులను నిత్యంబున్ ప్రసాదింపవే.

విజయనగరాంధ్ర శిల్ప ప్రవీణతలను
అల్ల పెన్గొండ ప్రాక్షాలతాలయముల
నా మధురకావ్య వల్లకీనాదమందు
అమృతకళ చింది పోషింపు మాంధ్రజనని!

సురభిళమయి, నవశోభా
కరమై, ధర్మప్రసూన కలితంబై, భా
సురజాత్యభిమాన ఫలో
త్కరమయి మా తెనుగుతోట కన్నులు దనుపున్.

ఓ యాంధ్రజనని, స్వర్గ
ప్రాయంబై తెలుగుభూమి పరిసరరాష్ట్ర
శ్రేయంబుల నార్జించుచు
హాయిగ మనవలయు వేల్పుటవనిజనుగన్.

## 2 రాజర్షి

అదె తరంగ ఖురోద్ధూతమైన ధూళి
యెగసి నలువలంకులఁ గ్రమ్మె గగనవీధి
అంతలంతల వినవచ్చె నశ్వహేష
తనకు నిరుపార్శ్వముల సైన్యతతులు నడువ
నడుమ ధవళాశ్వమెక్కి, దిక్తటుల నించి
ప్రభలు వెలుగొందఁగా ఖడ్గపాణియగుచు
రాజ్య విస్తరణాకాంక్ష రవులుకొనఁగ
అల విపక్ష చమూ సమూహములు చెదర
కదియుచున్నాఁడు మన యశోకప్రభుండు
లీలఁ గబళింపఁ దలఁచి కళింగసీమ

కలియఁబడి సైన్యములు రెండు కదనభూమి
ఘోరయుద్ధప్రకార సంకులముగాఁగ

శీర్షములు ద్రుంచి శత్రుల స్వీయసైన్య
ములు జయధ్వానము సేయ — కలలుగన్న
నృపతి — తెలియఁడు పరిణామ మెట్టులగునొ —
కదియుచున్నాఁడు మన యశోకప్రభుండు
లీలఁ గబళింపఁ దలఁచి కళింగసీమ

నడచు మార్గములో చిరుగడల వంకు
నందుఁ బెనగొన్న తీవ లల్లంతసాగ
హైందవ ప్రభుకోరిక లలరునట్లు -
తరువు లిల రాల్చె పూలు మౌక్తికములుగాఁగ
హైందవప్రభు జయలక్ష్మి హాసమట్లు -
యుద్ధభటు లార్వ, కేకలుజ్జూఁత లూఁచి
యాకసము నెల్ల దిగలాగినట్లుగాఁగ
రాజ్య విస్తరణాకాంక్షి రవులుకొనఁగ
కదియుఁచున్నాఁడు మన యశోకప్రభుండు
లీలఁగబళింపఁదలఁచి కళింగసీమ -

జరిగిపోయిన దారుణ సంగరమున
అట్టి హతమైన శత్రుసైన్యములఁ జూచి
వారి రక్తధారల నిజబాష్పవారిఁ
గలిపి, హృదయంబు మాఱ నిశ్చలతఁగూరి
'జీవితంబున యుద్ధంబుసేయ' ననుచు
తీవ్రతరమైన భీష్మప్రతిజ్ఞఁబూని
కదలుచున్నాఁడు మన యశోకప్రభుండు
మరల దరిశింప సువిశాల మగధసీమ.

ఏమి యబ్బెంబో యియ్యది ఎంతలోన
హృదయ పరివర్తనముగల్గె నితనియందుఁ
గావికుబుసంబు దాలిచె కర్ణపథము
నందు బౌద్ధ బోధామృతమ్మనుభవించె
ఛాత్రులను బంపె దేశ దేశాల కెల్ల
విశ్వసించిన మతము వ్యాపింపఁ జేయ -
కదలుచున్నాడు మనయశోక ప్రభుండు
మరల దర్శింప సువిశాల మగధశిము -
అతుల భారతవీర, ఘోరాతి ఘోర
శత్రుభయదంబు, దుర్నిరీక్ష్యమ్ము హృదయ
సంగరతలంబు, వైరాగ్య శాత ఖడ్గ
మెత్తి కాముండు, క్రోధుండు, నీ ప్రలోభ
మోహ మదమత్సరుల, మోద పూర్ణమతిని
నఱికి వైచితి—నీదు రాచరిక మయిన
ధర్మమునకోడి జన్మ సార్థకము గాఁగ -
ఓయి రాజర్షి, శాంతి శోభాయుతమ్ము
భరత ఖండమ్ము, నీ దివ్యపాలనమున

## 3 సంయుక్త చేటిక

నామృదుహస్తముల్ నలిగె, నైనను, నీశ్రమ కెల్ల నోర్చి య
క్కామిఁణు లెల్ల నేర్చి, యొక దామము గూర్చిన దాన. దీనినే
ప్రేమతపస్వి కంఠమున బెట్టుదునో, జగమందు నన్యశో
భామయు లెవ్వరీ చెలువ పాలియమునందను చూఱినాఁడగన్.

ఈసౌందర్యము దైవదత్తమయి నన్నీచింతలో ముంచె, నా
కీసౌందర్యమె లేకయున్న యెడ, లేదీకాంక్ష నాయందు, లీ

ఖాసంధ్యాసతి చందమామ కవ్రీళ్ళం జేర్చి యోలార్చెన
యెహ్యా, సంయుక్త మనోజ్ఞజీవిత సుమం బూగింతువే తుమ్మెదా!

మాసంయుక్త స్వయంవరం బనుచు ప్రేమంజాలుగా బంచె తా
నీసర్వంసహయెల్ల నాజనకుం డీ యేతెంచు రాజన్యులం
దేసాంగత్యముజేతునో, తలపులెన్నోతోచి యీనాడు నా
లో సంతాపము గూర్చుచున్నయవి చాలున్ యౌవనాయాసముల్

హృదయంబంకితమిచ్చి కొంటినిగదే, పృథ్వీధరాకాంతుడీ
యాదన్ నాకులభింపడో. జనకుడేలా యింతవిద్వేషమున్
పొదలంజేసెనో నామనోహరునికై ముత్యాలహారమ్ము మా
రదో నా తీవ్రతపస్సులో, నిక యపూర్వంబక్షమాలాకృతిన్.

ఎంతలుసేసెనేవిధి, మదీప్సితమంతయు వమ్ముగాగ జ
న్మాంతర పాపకర్మ ఫలమంచుదలంచెద, లోనియాస, శు
ద్ధాంతసఖీజనంబునకు దాపక చెప్పితి నెన్నిమారులో,
కాంతలు భారతావనినిగాక పతివ్రతలెందు గల్గిరే?

మనదేశమ్మునపయిన్ చమూవితతితో మానూదుగోరీ, కుత్రిధా
కనదుగ్రాక్షులు విప్పిచూచె-నెప్రైక్యంబేర్పడున్ హైందవా
వనిలో రాజులకెన్నడభ్యుదయ దివ్యానందమున్ గూర్చి ప్రా
క్తనధర్మంబులు మ్రోగునో తరగలై కాలప్రవాహంబునన్.

## 4 విపణివీధి

రారండు రండు రండోయి జనులార
రత్నాలు-వెల గలుగు రత్నాలు-నూత్నమౌ రతనాలు

వాసి వన్నెయు గలవి—రాసులుగ బోసితిని
హారాలు గట్టితిని—మీకు కొనరండోయి

విపుల గీర్వాణాంధ్ర విపణి వీథులను
వెల గల్గు రత్నాలు తల మానికములు
రండు రారండు గారండోయి జనులార
మీకు నచ్చినవాని మీ కేరికొనుడు
ఆదికవి మునిచంద్రు డయ్యె వాల్మీకి
తొలుసారి సృష్టి, వెన్నెల లిండ్రు రాహాదు
హారచ్యుతంబైన యట్టి సన్మణుల
నేరి కూర్చిరి మరల నెన్నొ హారాలు
అమృత దివంబులో నద్ది తీర్చినవి
రామాయణాఖ్యమౌ రత్నహారంబు

మును శకుంతల యందమున కనుగుణముగా
కాళిదాస కవీంద్ర కల్పితంబగు నిద్ది
శాకుంతలము పేర సరసమైనది దీని
రత్నహారము గాంచి రసికలోకము మెచ్చె
రారండు రండు రండోయి జనులార
తుల లేని రత్నాలు—వెల గలుగు రత్నాలు

ఇది చిన్ని హారంబు హృదయంగమంబు
ఖండ ఖండాంతర ఖ్యాతి గడియించె
కాళిదాస కవీంద్ర కల్పితంబిదియు
ఒక యక్షకాంత బహిఃప్రాణమైన
యీ రత్న హారమ్మె—ఎవరి కిష్టంబో

మేఘ దూతంబను మేలి నామంబు
నలిపివేయకుడు చేతుల దాకి దాకి
వెలయిచ్చి కొనరయ్య విశ్వమోహనము

పవితంబున మంచి ప్రఖ్యాతి గన్నాడు
భవ భూతిచేతిలో పరిపక్వ మొందినది
రామ చరితము పేరి రత్నాల హారంబు
కాంచి కన్నీటితో కడిగి వేయగ గలరు
రారండు రండు రండోయి జనులార
సంస్కృతోజ్జ్వలమైన స్వర్ణహారము కొనగ

క్రొత్త పోకడలెల్ల కుదురుకొన నిర్మించె
దిఙ్నాగ కవి కళారక్తి దిక్కుల కెగయు
కుంద మాలిక పేర కొమరారు హారంబు
భావ రత్నప్రభా భాసమానముగాగ
రండు రారండోయి రండోయి జనులార
మెరుగైన హారంబు దొరక దీ హారంబు

రతనాల ప్రేమించు రసికు లెవ్వరో
రతనాలు వెలగట్టు మతిమంతు లెవరో
రండు రారండు రండోయి జనులార
అలమయూరుండు సూర్యారాధనమున
శతరత్న హారంబు సంధించినాడు

పేటి కాంతరమున ప్రియము గొల్పెడిని
యీ నవోషః కాంతి మెరుగరోయెప్పుడు

భట్ట నారాయణ ప్రతిభాకృతంబు
వేణీ సమాఖ్య నివ్వెర గొందజేయు
ద్రౌపది మును దాల్చు రత్న హారంబు
విమల మానసు లున్న వెలసేసి కొనరే

కళల నారాధించు లలిత హృదయుల కొరకు
పురుషులకు పొలతులకు పొలుపొందు రత్నాలు
కమనీయ మాధురీకలిత మైనవి కొన్ని
విమల సౌందర్యంబు వెలిగ్రక్కు, నొక కొన్ని
నన్నపార్యుడు సుధా నవ్య కాంతులు జిలికె
భారతంబను పేర బరగు హారంబు
అందాల లోతుల సందె వేసిన చేయి
ఈ హార నిర్మాణమే కోరి కావించె
తిక్కనార్యుని భావ దీప్తులం దెగ్రాకె
శంభుదాసుడు కొంత సమకూర్చె నిందు
కొనరారె కొనరారె కొనరారె దీని-

హిమగిరి సానువు లెల్ల శోధించి
అమలిన రత్నంబు లల్ల సేకూర్చి
పెద్ద నార్యుడు కళావిభవంబు దోప
అల వరూథిని హృదయము ముద్దుపేర
దివ్య దామంబుగా తీర్చి తిద్దినది
రండు రారండు రండోయి జనులార
రత్నాపణంబుపై రక్తి మానవుడు

దేవముని చేతిలో దివ్య కీర్తనములో
పరిపూతమైన దీ భవ్య హారంబు
ముక్కుతిమ్మన ముద్దు ముద్దుగా సమకూర్చె
పారిజాతము పేర పలువుర మెప్పు
బడసిన హారంబు ప్రజలార కొనరె.

ఇవి రత్నరాసు లిందేరి కొనుడయ్య
వేమనయోగి పవిత్ర హస్తమున
యేర్చి కూర్చిన మణు లెవరు గోరుదురో
స్వచ్ఛమై వెలుగొందు స్వప్రకాశమున
రండు రారండు రండోయి ప్రజలార
వెలలేని హారాలు—తులలేని రత్నాలు

## 5 నా ప్ర భూ

వలదు మనోజ్ఞహర్మ్య సుఖవాసనలెవ్వియు - జీవితంబులో
తలపునలేని సౌఖ్యములు - త్వత్కరుణారస వాహినీసము
జ్జ్వల మధురాంబు పానములు నల్పవదు చిన్నకుటీరసీమ, నీ
చెలిమికి నాదుప్రాణములు సిద్ధముచేసితిరమ్ము నా ప్రభూ!

ప్రేమయొకండె నిన్ను వలపించెడు వస్తువటంచు నాదు హృ
త్ప్రేమకు దోచిపోయినది, తీయని నాయనుభూతి యెల్ల నీ
ప్రేమకు ధారవోసితిని, ఱెక్కలు విచ్చిన పక్షిగాగ నా
ఖామము చెంత వ్రాలుదుగదా, క్షణమాత్రములోన నా ప్రభూ!

అల్లన కంఠమెత్తి ప్రియమారగ బిల్చిన, నాస్వరంబుతో
పల్లవితంబుగా మృదుల భావనలన్నియు గుర్కు నత్తె నా
యిల్లనివత్తు విమ్మోడకు నెయ్యోడకుం జనవింక, నేను పూ
వల్లరి, నీవు వృక్షమవు ప్రాకెద నీమదిమొల. నాప్రభూ!

ఎన్నడు నీవులేవో, భువినెందును నేనును లేనుగాన, నా
కున్న సమస్త మీ వొకడవోయను వెఱ్ఱియె నాదిగాన, నీ
చిన్నెలులేని నాబ్రతుకు చేదయి తోచునుగాన, నన్ను నీ
కన్నుల కౌగిలింతకడగా నొనరింపగరమ్ము నాప్రభూ!

నీ వొక బాటసారివయి నిల్తువు నా గృహసీమచెంత నం
ధ్యావిపులాంధ కారముల నక్కట - ఆకలిదప్పి దీర్చి నీ
తోవకు చల్దిగట్టి పరితోషమునన్ పయనింపజేతు మ
ద్భావ పరీమళంబు దనుపన్ తొలివెల్గులలోన నాప్రభూ!

## 6 సృష్టిమర్మము

ఈ వనాంతరసీమలో నెదిగియున్న
పాదపములందు కొన్ని నిష్ఫలములుగాగ
కొన్ని ఫలపూర్ణములుగాగ గోచరించె
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్యా.

కూడబెరిగిన తీవెల కొనలయందు
ఒక్కనన యందమొలికించు, నొక్కపూవు
కనులుపండువు సేయదే కారణంబో
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్యా.

మాతృగర్భంబు నందొక్క మనుశతోనె
జననమొందిన సంతానమున నొకటికి
కనులు, అంధత్వ మొకరికి నునిచినావు
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్య.

అభిజనమువీడిపోక సుఖానుభవము
పడయుచున్నా డొకండు, పరివాసి యొకడు
హార్మ్యమున నీడు-గుడిసెలయందు వాడు
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్య.

ఆరజల్లిన గింజలు నాశ్రయించి
గఱులునాస్చుచువచ్చె ఖగద్వయమ్ము
ఒకటితినిపోయె, వేఱొకటుఱకబోయె
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్య.

ఇలను సంసారభారమ్ము తలనుదాల్చి
సేయుచున్నవాడొక్కడు జీవయాత్ర
చేతధరియించె సన్యాసి శిథిలపాత్ర
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్య.

పయన మొనరించుచున్న యీపాంథజనుల
అడవి నడువీధిలో ప్రవాహమునబడిరి -
ఒకడు దరిజేరె, అసువుల నొకడువాసె
సృష్టిమర్మంబులివి బోధసేయుమయ్య.

క్రమ్ముకొనివచ్చు గాఢాంధకారమందె
నడకసాగించు నొక్కడు జడియబోక

పంచుమవెన్నలనొక్క దేవ్వంగసాగి,
సృష్టిమర్మంబు లివి బోధసేయుమయ్యా.

గాఢనిద్రాసుఖంబున కనులుమూసి
సొలికవెట్టెడు నిరుపేద తరులనీడ,
రేయిజాగరణము సేసె శ్రీయుతుండు
సృష్టిమర్మంబు లివి బోధసేయుమయ్యా.

అమృతమయభాండ మబ్బిన యతడొకండు
పూని త్రాగడుచో నొల్కబోసె-నొకడు
ఒలికిపోయిన మధువు చిన్నెలకనించె
సృష్టిమర్మంబులివి బోధిసేయుమయ్యా.

## 7. వెఱ్ఱిపాట

వెఱ్ఱిపాటల నే నాలపింతు ననుచు
కలవు బోధించెల్ల పిచ్చిపోకడలె యనుచు
నవ్వుకొను లోకమునకు వందనము లిచ్చి
స్వామి, నినుగూర్చి మాటికి పాడుకొందు.

ఈ కవిత్వపు పిచ్చి నా హృదయసీమ
పరిణతి వహించుకొలది, దుర్భరదురంత
వేదనామలీమస మగు విశ్వమందు
వెలుగుదారుల కవలియంచుల జరింతు.

భావనోన్మాదమో, ప్రేమభరమో తరచ్చిః !
పాడుకొనుచున్న నా చిన్నిపాటలోన
కాంచుచుందును నా నాట్యగతులయందు
చిత్తమలరించు పరిత భావిశేషమ్ము.

## 8. నవ్య సందేశం

ఇచ్చినది నాకెల్ల
పుచ్చుకొంటివి స్వామి
ఏ నొకడె మిగిలితిని
ఇలకు భారంబుగా
ఆకలి దహిస్తుంది
అమిత్వమైనది దప్పి
ఆక్రందనంబులో
అల్లాడినది జగతి
పుచ్చుకొంటివి స్వామి
ఇచ్చినది నాకెల్ల.

ఇచ్చితివి నాకంచు
నెడద బొంగితినప్పుడు
పుచ్చుకొన్నంత నా
పొలుపు దూలినదిప్పుడు
ఈ చేతలకు నర్థ
మెవరు విరిచేవారు
నాటికీ నేటికీ
నవయుగంబుగమారె.

నవ్యసందేశ వీ
ణానాద మాధురియె
నా హృదయమెల్లెడల
నాటుకొని పోయింది
పుచ్చుకొన్నది మరల
ఇచ్చి పోదువు స్వామి
తెచ్చినది నీ కంచు
తెలిపిపోదువు స్వామి.

---

## 9. గురుస్మరణ

కరుణావాహిని నీకనుంగవ సమగ్రస్ఫూర్తిశోభిల్ల పెం
డెరలో చీకటిలోనటించు మదికు తేజంబు గల్పించి నా
చిరుప్రాయంబున త్రోవసూపిన నినున్ సేవింతు నాభక్తి త
త్పరతన్—ప్రాథమిక ప్రసిద్ధగురుదేవా, నానమోవాకముల్.

పరమార్థంబులు సృష్టిలోగలుపి నవ్యాధ్యాయముల్ విప్పి. య
క్షరముల్ నేర్పితి: భావిజీవితశుభాశంసల్ ప్రవర్తించునీ
కరకంజంబులలో సుధారసము వాకల్ వాగులై పారె, నీ
వరముల్—ప్రాథమిక ప్రసిద్ధగురుదేవా, నానమోవాకముల్.

తరుణార్కుండుదయించు వేళలకు నిద్రామాంద్యముందోలిచి. చె
చ్చెర నే తెంతునుపాఠశాలకు భవత్సిద్ధాంతముల్ దాట నె
వ్వరికింజెల్లును: నీవు నేర్పినది సర్వస్వంబు నే నేర్చితిన్
త్వరలో—ప్రాథమిక ప్రసిద్ధగురుదేవా, నా నమోవాకముల్.

హృదయక్షేత్రములో న
మ్మృదమున నీవిడిన పైరు పోబెరిగి ఫల
ప్రదమయ్యె నేఁడు నీమృదు
పదసీమల వ్రాలిపోదు ప్రార్థమికగురూ!

రమణీయదివ్యబోధా
క్రమశిక్షల మేలుకొల్పి కరుణింపగ, త
త్త్వము నెఱిఁగితి మీకడ నా
శ్రమవాసమునందువోలె ప్రార్థమికగురూ!

నందన భావమ్మున మి
న్నందగ జేసితివి తండ్రి, యభినవకళికా
బృందము తలసూపెను హృది
వందనశతములు—నమోస్తు పరమగురువరా!

## 10. స్వర్గీయ రాయలసీమ చిత్రకారుడు

( శ్రీ సి. యన్. వెంకటరావు గారు పెనుగొండ )

ఉ॥ యాత్రముగించి యీజగతియందు మించితివయ్య పావన
క్షేత్రము నెన్నడో, కళలు జిమ్మవు తావక దివ్యభావనా
నేత్రములింక, నీహృదయ నిర్మలతన్ దలపోసి లోకమో
చిత్రకళా విశారద! రచించెడు మాటికి కేలు మోడ్పులన్.

మ॥ అల పెన్గొండనివాసులై, సుకవితావ్యాసంగముల్ సల్పి పె
ద్దలు ముక్కెరి-అల్లసాని పెనిచెన్ ద్రాక్షాలతల్, పారిజా
త లతాంతంబుల ముక్కుతిమ్మన లసత్సౌరభ్యభవ్యముల్ నింపె రా
యలు పూజింపడె ద్రావిడీ మధుర కన్యాముగ్ధ సౌందర్యమున్.

మ॥ అల పెన్గొండ నివాసివై యచటి శైలాగ్రంబులన్ మేఘ మా
లలసౌందర్యముజూచి చొక్కితివొ, తత్రాప్రాంతంబులన్
పూచు పూ
ఫులకున్ చేతులు మోడ్చి మ్రొక్కితివొ, తపంబుల్ సల్పెదో
పొంత ప
ల్లెల వాసించు సుగాలికన్నెల కళాశ్రీలన్ ప్రశంసించుచున్.

మ॥ ఎటులీ, భారతభూమి నిన్నెడసివో మెత్తున్ విషాదా ప్తి, వేం
కటరాయాగ్రణి! నీయశోలతిక లింకన్ ప్రాచ్య పాశ్చాత్య ది
క్తటముల్ ప్రాకినవెంత ధన్యుడవొ! పూతంబైన నీ సేవలో
నటనంబాడిన భావనాబలము సంధానించు శాంతిప్రభల్.

ఉ॥ జీవిత మంతరాయములజిక్కి కృశించు కొలంది, నీ కళా
సేవ ఫలించి పోయినది చేరువ నీ పొదరింఢ్ల ముంఢ్లలో
తీవలు ప్రాకిపోవు ప్రకృతిన్ దలపించుచు, చంచలాలతల్
ప్రోవులుగట్టి నిల్చినవి పూర్వము నీ రచనానుభూతిలోన్.

మ॥ నిను పౌరాణిక వృత్తముల్ కలపగా, నీచిత్తమానంద భా
వనలో దేల్పగ నిర్మల ప్రకృతిశోభల్ చిత్రనిర్మాణ కా
రణదక్షంబగు నీదు హస్తము చెమర్పన్ బోలు, నీనేత్రముల్
ప్రణయాశ్రుల్ గురియింపబోలు, తలపుల్ తాదాత్మ్యమున్
బొందగన్.

మ॥ రతనాలెన్ని యడంగిపోయినవో యారా, ధాత్రిగర్భంబునన్
వెతకన్ జాలిన పుణ్యుడెవ్వడొ, కళా విష్కారమున్ జేయ నీ
బ్రతుకే నల్వదిమైదు వత్సరములన్ భాసించె, నీమూర్తి చి
త్రితమై పోయిన యాత్మలన్ మరల నుద్దీపించునే తత్ప్రభల్.

ఉ॥ రాయలసీమలో మృతతరంబగు నీకళ యుత్తమింప నే
డీవొక శిల్పకుండు. గళమెత్తి మహోగ్రత నేమ్రరయ్యొ, ప
చ్చాయల శిష్యవర్గములు శాంతి వహించితివెందు, రమ్మ్రు నా
తీయనిగీతిలో స్మరణ దీప్తులు రాల రహస్యభంగులన్.

## 11. గంజి కేంద్రము

కేనుడోయీ యిట గంజికేంద్ర మిటు లాకర్షింప డాకిందని
ధ్వని హస్తంబులు మట్టి పాత్రలు వహియింపన్ దీనభావంబు లా
ననసీమన్ రహియింపగా ముసరుచున్నా రెంత దారిద్ర్య మీ
జనతన్ మ్రింగగ వేచియున్నయది దుష్కాలంబు ప్రాపింపగన్॥

ముదుసళ్ళు, స్త్రీలు పురుషులు
పెదవులు తడియూరు చంటిబిడ్డలు మెయిప
య్యెదలేమి సిగ్గు మరచిన
సుదతులు గలరిందు, క్షుదకుసోలి నడచుచున్

పరిశీర్ణంబులొ, అగ్ని కాహుతులొ, లేవా వీరికిన్ మున్ను కా
పురముల్ సేసిన పూరిపాకలు లవంబున్, కూలి ధాన్యంబు లీ
వ్వరొ రైతుల్ దగగొన్న వీరిగని పాపం బంచు నే యమ్మయున్
కరుణన్ బిల్చి జలంబు గ్రోల్చెదొ, మహోగ్రింబయ్యె నే దేశమున్

చెఱువుల్ నిండినచోట, సస్యము శుభశ్రీ వెల్గు నచ్చోట నువ్వర
ధర్మంబులు గల్గుచోట నవరింపన్ రావె దైవంబ, ఈ కొఱ
ప్రాణంబుల నున్నవారి బ్రతుకుల్, కూడిచ్చి నీరిచ్చి సోదరులారా,
బ్రతికింపు డాత్మసములన్ తత్త్వజ్ఞులై మీరలున్॥

కనులే కానగరాని యంధు డొక డీ ఘంటా పథంబేగు, తీయని।
యిల్లాలి కరంబు నూతగొని యీ యన్యోన్య భావంబు ప్రాక్తన।
దాంపత్యమ్ము భావలోకమున నేకాంతంబుగా జూచి, పూచిన।
గీతంబులు చల్లరా సుకవి, నీచె బండు సర్వస్వమున్॥

## 12. నమస్తే

రమణీయంబులు శృంగమాలికలు, నేత్రానంద సంధాయి వ
పమ్ము, నానా తరువాటికల్, ప్రకృతి సౌభాగ్యంబు ప్రాచీన కా
లము పోషించిన వైభవంబేదియొ పిల్వన్, నాదు డెందంబు భ
క్తిమయంబై పులకించుచున్నది నమస్తే దివ్యగిర్యగ్రణీ!

కల్యాణదుర్గ పురమున
కల్యాణ సముంచితంబుగా నెలకొని కా
ఠిల్యంబు నెరపుచుంటివి
కల్యాణ గిరీంద్ర, నీకు గావింతునుతుల్.

గగనంబంటెదొ యంటవో హృదయమార్గంబంటె నీశోభ, నే
రుగ దూరంబుననుండి చూడదగు నీరూపంబు, ఏమాని నీ
దు గుహాగర్భములో తపోనియతి లోతుల్ గాంచె నాధ్యాత్మిక
ప్రగతిన్ జాటెడు నీగభీరత, యహోరాత్రంబు భూభృన్మణీ!

## 13. సంక్రాంతి కన్యలు

వింతగ పూచెకన్నులకు విందుగ గుమ్మడిపూలు, పల్లెలం
డెంతటిరామణీయకమొ – యిచ్చట నుయ్యెలలూగి యివ్వనీ

ప్రాంతములందు నాడు కోవవచ్చిన కన్నెలమంద హాస సం
క్రాంత మనోహరత్వము పురాది వసంబులనాన గొల్పెడిన్.

ఎంతముదావహంబగుచు ప్రేక్షకులన్ దనియింపసాగె సం
క్రాంతి దినోదయ ప్రకృతి, కన్నెయె కర్తృక స్వీయసత్కళా
కాంతుల నారజల్లి చిరకాలపు టాంధ్ర తపస్సు పండిన
ట్లింతయు మ్రుగ్గుదీర్చి. కనుఱెప్పలు వాల్పక చూచునందమున్.

ఒకచోజేరిన కన్యకామణి, ప్రభాతోద్యచ్ఛ రస్నాత, సూ
ర్యకరాళిన్ నిజసీల కుంతలము లారన్వైచి, పూజా ప్రసూ
నకముల్ పళ్ళెరమందు బోసికొని బృందన్ జేరియర్చించు, గా
నకళాగర్భముజీల్చి తెల్గునుడు లందంబుల్ ప్రవర్షింపగన్.

ఒక పేదయింటి బాలిక
మొకమంతయు కనులుగా ప్రమోదించి. రసో
త్సుకయయ్యె నవ్యవస్త్రా
దికములు సంక్రాంతి పర్వదినముల గనుచున్.

ఈనవ్యాంధ్ర సుపర్వవాసరము లిట్లేతేర, ప్రాచీన లీ
లానైపుణ్యములన్ స్మరించుకొని బాలల్కూడి నిత్యోత్సవ
శ్రీనాట్యంబుల దేవకన్యలు వోలెన్ తేజరిల్లన్ ప్రభూ
తానందాభ్యుదయంబులన్ తెలుగు ప్రాంతంబెల్ల శోభిల్లెడిన్.

---

## 14. సందేహము

---

హారాలు గూర్తునా
పారబోయుదునా

హృదయార్ణవము నుండి
వెదజల్లబడు చుండె
అన్నియూ రత్నాలె
అన్నియూ రత్నాలె
రమ్య హర్మ్యములోని
రమణిచేతుల బడునో
పూరిపాకల పేద
రాలికే దొరకునో.

హృదయ వనిలో నుండి
వెదజల్ల బడుచుండి
అన్నియూ కుసుమాలె
అన్నియూ కుసుమాలె
ఆసలే లేని స
న్యాసి యడుగుల బడునో
అవని పాలించునా
యధిపు మెడలో బడునో

పారబోయుదునా
హారాలు గూర్తునా

హృదయ గర్భమునుండి
వెదజల్ల బడుచుండె
అన్నియూ గీతాలె
అన్నియూ గేయాలె
ఆకసంబున చుక్క

లంటిమా యంబగునో
కరుణగల నాస్వామి
కష్టమీఘుల బడునో.

హారాలు గూర్తునా?

## 15. తెలుగు శిల్పి

ఎవ్వరీ శిల్పకళల సృష్టించినారొ
కొమరుగులుకు నాగార్జున కొండలందు
సాత్వికానంద రసధుని, చక్షుయుగము
నందు స్రవియించు, వదన శోభాతిశయము
తపము సూచించు, మధుర శాంతతన దించు
ఓయిశిల్పి, నీజీవితాధ్యాయ మెట్లు
గడచె, కడుపునిండుగ బువ్వగలిగెనా, దు
రంత దారిద్ర్యబాధ నిన్నలమికొనెన
విశ్వమోహానమగు దివ్యవిగ్రహముల
చరమ జీవితమెల్ల దాపరిక మిడితి.

కవితయన చిత్రకళయన్న గానమన్న
నాట్యకళయన్నచో మహానందమొంది
లలితకళలందు హృదయ మర్పణముసేసి
ఆవరించిన కాలము లంతరించె
ఈ కళారాధకుల ఋణమెపుడు తీర్చు
కొనునో, భరతఖండము — విశ్వజనని చూపు
లెపుడు ప్రసరించునో వీరి యెడలతండ్రి!

# స్వర్గద్వారము

## (పూర్వఖండము)

### 16. ప్రకృతి సందేశము

—o—

స్వామి వచ్చునటంచు సందేశ మిచ్చి
ప్రేమంపుదూతిక ప్రియమొనరించె
"ఉపకార కృత్యంబు నొనరించునీకు"
"నెపుడు కృతజ్ఞతయే జెప్పికొందు"
అనుచునా చెలికత్తె నవ్వలికనిపి
మనమెల్ల ప్రణయైక మగ్నమైపోవ
ఉద్యానవన విహారోత్సుకత్వమున
సద్యోజనిత భావ సంభ్రమంబలర
కుసుమాపచయమున కొంతకాలంబు
మసలి యాతోటలో — మంజులసాంధ్య
కాంతులాకసమున గలిసిక్రీడింప
చెంతనా గృహసీమ చేరబోయితిని.

నానాథుడే తెంచు నాగృహంబునకు
ప్రాణనాయకుడు, నిర్భరరాగ శీలి
నవనవానంద సంధాయ కుండతడు
ప్రవిమల సౌందర్య భావతత్పరుడు
నాయందు గల్గుగుణ ప్రకరణంబె
తీయని భావానా దివ్యమార్గంబె

ప్రాణనాయకునందు పరిమళించెడిని
నానాథుడే తెంచు నాకోసమనుచు
కోరికప్పై కోర్కె కొందలపరుప
కాఱుచీకటి గ్రమ్మి కడలెల్లముంప
విజన ప్రదేశంబు వెదకి వేచితిని
నిజము — పురాపుణ్య నిచయంబు పంట

చంద్రబింబముదోచి చంద్రికల్ బరపె
సాంద్రమేఘము నిజచ్ఛాయలో ముంచె—
ఖగరుతంబులు చెట్లకలకలబల్కె—
గగనంబు నిశ్శబ్దకలితమైపోయె
తళతళ వెలుగొంది తారకాసమితి
తలదాచె రోదసీతల గర్భసీమ —
నానిరీక్షణములో నయనముల్ వాచె
ప్రాణనాయకు జాడపరికింపనైతి.

గాఢనైరాశ్య భగ్నాంతరంగమున
మూఢభావములోన మునిగిపోవలెనో
ప్రకృతి సందేశైక పారవశ్యమున
సుకృతాత్మనై నేను సొక్కిపోవలెనో
ఓనాథ నాకూర్చియున్న దామంబు
నానేత్రధారలో నలిగిపోయినది
తాకినంతనె వీణె తంత్రీస్వనంబు
నాకంఠరవములో నవసిపోయినది
నీ సమాగమములో నెలకొన్న సుఖము

మోసపోయిన మీద మొనయు దుఃఖంబు
భ్రాంతిమైదోపగా ప్రణయిని యింక
చింతా పరంపర చివికిపోవలెనో
ప్రకృతి సందేశైక పారవశ్యమున
సుకృతాత్మనై నేను సాక్షిపోవలెనో.

---

## 17. నాస్తి ఇహ పర చింతా

పాట యే నేనగుచు
పాటలో నిండారు భావమే నీవగుచు
పాట యీలోకాన ప్రవహింప నేఉలై
పరచింత నాకేలరా
ఇహచింత నాకేలరా
పాటలో నీమాట
పాటలో నీయాట
పవలు రేలును గాంచి పరవశతనే శాంతి
ఇహచింత నాకేలరా
పరచింత నాకేలరా
పాట యాకాశమై
పాటలో నీవొక్క పక్షివై పరతేర
పాటలో — నీలోన పరమార్థమే గాంతు
పరచింత నాకేలరా
ఇహ చింత నాకేలరా

పాటతో జన్మంబు
పాటతో మరణంబు
పాట నీకూ నాకు ప్రణయానుబంధంబు
ఇహచింత నాకేలరా
పరచింత నాకేలరా.

---

## 18. స్వామి రామదాసు

---

ఓసన్యాసి, సమస్త సాధుజన సౌఖ్యోల్లాస సంభాషి, మో
క్షాసక్తిన్ బులకించె నాహృదయ కోశంబెల్ల, రావయ్యా బో
ధాసూక్తుల్ వెలయించి నాకును భవత్సందేశ మీవయ్యా నా
యీసంసార వివర్దశల్ దొలగ, స్వామీ రామదాసూ, త్వరన్.

విమలత వస్వి, మొన్నయరవిందుడు లోకము వాసె మొన్న నే
రమణ మహర్షి పోయె, మధురంబగు స్విదర హాసరేఖ వ్యా
ప్తముగనె నేను సర్వ భవబంధములన్ తెగద్రెంచి; రమ్ము సం
యమివర! రామదాసముని, యవ్వలి తీరమునందు జేర్పగన్.

నాకుపదేశమిమ్ము గగన ప్రసవంబు, మహత్తర ప్రభా,
స్వీకము దైవమందు రదినిర్మలమైనది జ్ఞానమా — తద
స్తోక సుధాస్రవంతి కొలకుల్ గని యీదిన వారలెల్ల నీ
లోకములోన ధన్యులని రూఢి వహింతురె సాధుపుంగవా.

హిమవత్పర్వత శృంగభూములను నీవే తేరగా నీమహ
త్వములెన్నెన్నొ వచింత్రు, విషసర్పంబుల్ మహోదుష్ట, స
త్వములందందు నినున్ స్పృశించి ఒక బాధన్ గొల్పవంచున్ అహో
మము నీవృత్తము రామదాస మునిలోక గ్రామణీ! చూకిటన్.

## 19. శ్రీ అనంతాశ్రమ సందర్శనము
(కొత్తచెఱువు)

ఇచటగలడేమొ పరిభువు - నేనీజగాన
హృదయ మర్పించి వేచితి నెవరికొఱకు
సర్వమును ధారవోసితే స్వామి కొఱకు
ఇచటలడేమొ పరిభువు - నే సింపనిలుతు.

ఎవరోయీ యిటకావి తాల్పు - జగంబే సర్వమున్ మిథ్యగా
నవలోకించిన సాధుమూర్తులు - మహోద్విద్దివ్య తేజస్వులీ
నవవిద్యా పరిపూర్ణులీశ్వర కథానందైక లోలాత్ములు
త్సవ మీనాడు మదీయ నేత్రములు కంతర్జ్యోతి దీపించెడిన్.

గిరిశిఖరంబు హాయిగలిగించెడి చల్లని మారుతంబులీ
పరిసర వృక్షశాఖకల బల్కెడి పక్షుల నిశ్వనంబులీ
శ్వరచరణాంబు జాతముల జాడలువట్టిన మీతపంబు మీ
పరళ హృదంతరంబు నొక స్వర్గము గాగను పట్టెనిచ్చుటన్.

ఇటజలాశయ పీచుల హృద్యగతుల
నృత్య మొనరించు బండు వెన్నెలలయట్లు
భగవ దాలింగనమున మీ పరమశాంత
హృదయములు లాస్య మొనరించు నిహముమఱచి.

వేదసారంబు లిచ్చోట వెల్లివిరియు
ఉపనిషత్సార థంబు లుజ్జ్రూతలూచు
జ్ఞానవైరాగ్య బోధలీ సానుతలిని
ఈయనంతాశ్రమము సందు హాయిగొలుపు.

సాంధ్యరాగార్ద్రరమ్య పక్షములుదాల్చి
విహగ సంతానములు గాన వీథిదేల
భూరజోంకితములు—ధేనువులును నిచట
దారిబోలేవు తన్మయత్వము వహించి.

---

## 20. సమాధి

---

నేనొక పాట పాడితిని నిశ్చలత భావ సమాధి లోన క
న్గోనల మోద బాష్పములు గూర్చి, నీవది యాలకించి నా
పై నభిమానమూనెదని ప్రత్యయమున్నది కానినాడు—అ
మ్లానవనంబులోన జపమాల ధరించెద శాశ్వతంబుగన్.

ఇంతటి శోకమేటికి వహించెదు నాకయి నిన్నుజూతునే
కాంతమునందు నంటివి దయామయ, తీవ్ర నిరీక్షలోన నా
స్వాంతము క్రుంగి పోవుటలు స్వామి యెఱుంగని దేమిలేదు జ
న్మాంతము నేడిపింప పరమార్థము దాచితివేమి యిందులోన్.

ఎందరొవచ్చి యాత్రలు ముగించిరి, వారిడినట్టి కాన్క లీ
వందగ నేను జూచితిని యక్కట! యెంతయు దూర భూమి మ
న్మందిరమున్న వీడి పెడమార్గము లెన్నియొ త్రొక్కి త్రొక్కి నే
నిందు గమించితిన్ కనికరంపవు ఘోర తపఃప్రయాసమున్.

ఈయాత్రా కలకలమున
నేయెడ వసియింతొ యెరుగనించుకయును, యా
తాయాత జనంబులు బదు
లీయరు నాప్రార్థనంబు నెవరి నడిగినన్.

నీనవగీతిలో మహిమనిండినదంచు వచింపలేను నీ
ధ్యాన సమాధినున్న జడ దారుల నేరక మేటినంచు నీ
తో ననలేను. నన్ను వెతతో జన నీయకుమంతె చాలు ఆ
జ్ఞానవనంబులోన జపమాల ధరించెద శాశ్వతంబుగన్.

---

## 21. అంకసప్తకము

అరదంబెక్కి విదూషక ప్రివరుతో నాఖేట కౌతూహలా
తురతన్ కణ్వవనంబులో దిరుగుచున్ దుష్యంతుడయ్యా శ్రమాం
తర భూజంబుల చేరువన్ ప్రియసఖి నర్మోక్తులాలించు
సుందరి దర్శించె శకుంతలన్ మదన బాధా సంభ్ర తోన్మాదయై

విరహోత్కంఠత పూరు వంశమణి, పృథ్వీనాథుడ వ్వృత్తమున్
పౌరి మాధవ్యునితో వచించి యతనిన్ పొమ్మంచు నాహస్తి నా
పురి కంపెన్ నిజమాతృ వాక్యమున, సమ్మోనమ్ముతో తాపసో
త్కర సంరక్షణ కార్యమూని నిలిచెన్ ,ధర్మంబు పాలించుచున్

గ్రావోపాంతము పుశ్చర న్మృగతతిన్ ఖండించి మానీంద్రి స
ద్భావానంద కరంబుగా జనుచు పొంతన్ దివ్యకుంజాంత రో
ర్వీ వల్లీతత బవ్వళించి విరహార్తిన్ దూగు నక్కణ్వ పు
త్రీ విశ్వాసము ముద్దులాడె ప్రభు వందేకాంత దేశంబునన్.

శరిపురికిన్ ప్రయాణమగు కణ్వుని పుత్రికజూచి భావనా
పరవశతన్ దపించె వనపాదపముల్, ఝురులేడ్చె, మాతృ హృ
ద్వారములు విప్పి పక్షులు వ్యథాభర భగ్నములయ్యె, కణ్వమున్
త్వరితమె సాగనంపెను మతన్ నిజశిష్యుల తోడుమంచుచున్.

అలదూర్వాసుని శాపకారణమునన్ జ్యాభర్తచేతో గతిన్
నిలుపన్ జాలకపోయె సుంతయును తన్వీ ప్రేమ సామ్రాజ్యమున్
కలతన్ బొందుచు నంగుళీయకముబో, కన్నీరు రాల్పన్ శకుం
తల గొంపోయె నభోంత రాళమున నంతన్ మేనకా కాంతయున్.

కైవర్తుండ ప్రడంగుళీయకమునీగా శాపమోక్షంబునన్
భావంబెల్ల దపింప రాజవరుడున్ వారించె నయ్యుత్సవ
శ్రీవానంత దినోదయంబున, వనోర్విన్ జెంది దుఃఖించె వాం
ఛావీణా మృదుతంత్రి చిత్రపట వీక్షాలీలమై వ్రేలఁగన్.

ఔరా! యింద్రునికోసమై సురపురీయానంబు గావించుచున్
మారీ చాశ్రమ వీథులన్ బడి సుధా మాధుర్య ధుర్యోక్తులన్
గారా మొప్పగబల్కనిల్పె సుతునిన్ కౌఁగింట, దైవ ప్రభా
వారంభంబున ప్రేయసిన్ గనె విభుండానంద ముప్పొంగగన్.

---

## 22. ఉత్తరుని విజృంభణము

ధరణి ధూళులు మింటికెగయగ
ధారుణీతల మదరి పోవగ
కరితురంగ భయంకరంబుగ
కదిలె సైన్యములు

భీష్మభయద జ్వాలలవి గో
ద్రోణదుర్ఘంఝా నిలము లవిగో
కరితురంగ భటోత్కరంబుగ
కదలె సైన్యములు.

విజయ కేతన పఙ్క్తిధల
విసరుగాడ్పుల పటపటధ్వని
వివిధ దిక్కుల మారు మ్రోయగ
వెడలె సైన్యములు.

ఘుములు ఘుమ్ములై గోగణంబులు
విశ్రుతాంభారవము లెగయగ
విరటు నగరము లంత లంతల
విడిచి పరచెడిని

విపుల సేనామధ్య గతమై
విరిసికొని పరతెంచు రథమున
వెలుగు దుర్యోధనుని కన్నుల
వెడలె నిప్పుకలు.

అర్ణవము చెలరేగినట్టుల
అభ్రఘోషము లలమినట్టుల
కదలివచ్చెడి తీవ్రభంగుల
కర్ణ రథమదిగో

మొరయుచున్నది తూర్యనాదము
మ్రోసె శంఖ గభీర రవములు
ఉగ్రమైరణభూమి గనుగొన
నుల్లమది రెడిని.

"పఱచు నల్లదె పసుగణంబులు
పట్టుకొనుడదె చెదరిపోయెడి

పగ్గములు త్రెండ” నెఱిపలుకులు
పరచె వాహినిలో.

రా కుమారా! లెమ్ము సమరో
త్సేకమున నిక బయలుదేరుము
నీకు నీడగువారు గలరే
నిఖిల లోకములో.

అని గవాధ్యక్షుండు పలికిన
వినుచు నుత్తరుడంత కోపా
వేశమున మెయికంప మొందగ
వినిచె నిబ్బంగిన్

ఎందుకో ఘర్మంబు పూరము
క్రందుకొనె నుత్తరుని కాయము
సందడించెనొ భావమంతయు
సమర భూములకున్.

దక్షిణమునకు జనకు వెంబడి
తరలిచనె రథ చోదకుండును
తెరుగడపగ నింక నెవ్వరి
దెత్తునని పొగులున్

తనదు శౌర్యము, తనదువీర్యము
వనితలకు నంతఃపురంబున
వినుతి సేయ దొడంగె నప్పుడు
వేయి విధములుగన్.

నాశతాంగము నడప దొరకొను
నాదు సారథి లేడె యొక్కఁడు
లోకములు మూడెదురు పడినా
లొంగి పోజేతున్.

తనుగ వాధ్యక్షుండు పొగడిన
తనువు నెరుగడు మనసు నెరుగడు
తమ్ము పొగడగ నల్పులిల్లలో
నమ్ముదము గనరే

తన యశోవల్లికలు బెంపగ
తలరుచున్నదే లోకమంతయు
తనదు స్వార్థత్యాగమెన్నడు
ధాత్రిలో నింకన్.

నలుపవలె కర్తవ్యమొకడే
ఫలము దైవాధీనమనుచును
పలుకుచున్నది గీత — వినరో
భావ గర్భముగన్.

---

## 23. శివభారతము

కవి ఋణము తీర్పగలమో
శివభారతము కవి ఋణంబు శేషసుకవి, మా
కవితా వసంతు ఋణమును
నవమాధురి దొలకె తెలుగునాట వెలయుగన్.

కవి హృదయము ఋషి హృదయము
నెవరో యీఁతాకు వారశేనభ మందో
దవ్వు దవ్వుల వెలుఁగు జాబిలి
కపుగింట గొనంగ శిశువు కాంక్షించు కదా!

సందర్శన సంభాషణ
సందేశ విశేషముల కుచవి గొనిమీకై
డెందంబు విప్పివేచిన
దిందొక సాహిత్య సమితి తృష్ణాతురమై

శివ భూపతి చరితంబొక
నవనీతపు ముద్దయుఁచు నలరారినదో
కవిచంద్ర. అమృతధునిలో
నవగాహ మొనర్తరయ్యా అతిపుణ్యాత్ముల్.

తొలినాళ్ల కృష్ణ భూపతి
అలసాని కవీశ్వరునకు నర్పించె మహో
జ్వలమైన గండ పెండెర
మోఁమిన్, మఱిపడసినాఁడ వీవొకరుడవే.

తానా జీమ్రుతిలో, సు
జ్ఞాన జలధి రామదాసు చరితను నాంధ్రో
ద్యాన వనాంతర కోకిల
గానము విని పరవశుఁడనుగామె కవీంద్రా!

ప్రాచీన ధర్మబోధలు
పూచెను నీ భారతమున, పొంకారెడు నా

రాచరికపు మర్మంబులు
వాచంయమివగుదో రాజవర్యుఁడ వగుదో!

పారాయణ యోగ్యముగా
మీరచన పవిత్రమయ్యె, మేలుకొలిపెనీ
భారతము, ప్రాచ్య పరిమళ
పూరంబులు వెలసె మోద మొసగి తపస్వీ!

హృదయార్పణమని తనలో
నుదయించిన పద్యములు బహూకృతిగామీ
కొదవించె స్వీకరింతురు
గద, రాయలసీమ మధురకవి ధన్యుఁడుగన్

## 24. కట్ట మంచి

రసికవతంస, నీవును దొరంగితి భౌతిక కాయమింక సాం
పు సడలె తెల్గు సాహితికి పోయిరి నీకును మున్నె యెందఱో
కుసుమము లొక్క డొక్కఁడె నికుంజములో నిటు రాలిపోవ జూ
చి సొలసిపోదు, నేను విరచించిన గీతికలోన భావమై.

నీరమ్యంబగు జీవితంబమృత సందేశంబులన్ గూర్చి యాం
ధ్రారణ్యంబులు పూలుబూచినవి, సౌందర్యంబై పిసాళించె త
త్సౌరభ్యంబులు దేశమెల్లడల నీసాన్నిధ్యమే రామలిం
గారెడ్డీ, కఱవయ్యెనంచు మదిలో కంపింతు నత్యంతమున్.

పసితనమున రచియించితి
రసాంచితముగాగ మృదు కళాకలితముగా
ముసలమ్మ మరణమాద
ర్శసరణి మహిళాజనంబు సంతోషింపన్.

కవితాత్త్వములోని లోతులు సమీక్షాదృష్టి నందించి తె
ల్గు వధూటిన్ కయిసేసినట్టి ప్రతిభారోచిస్సు లీనాడు మం
జు విధానంబున నృత్యముల్ సలుపు నంచున్ చిత్తముప్పొంగు, నీ
దువియోగంబున నేత్ర గోళములు చిందున్ బాష్పధారావళుల్.

## 25. నిద్రాదేవి

కనులన్ మోడ్పగజేసి యూరుపులు గల్గన్ జేసిగాటంబుగా
ననయంబున్ మదినేర్చు చింతలకు సద్యశ్శాంతి గల్పించి నీ
వనురాగంబున కౌగిలించుకొన సౌఖ్యంబేదొ చేకూరు, నీ
ప్రణయంబున్ స్మరి యింతు నామధుర భావంబందు నిద్రాసతీ!

నీయంతనీవె, అనురా
గా యత్తత నరుగుదెంతు వనురాగములో
నీ యఖిల జగతి మరతును
నీ యెడ మార్దవముగాదొ నిద్రాదేవీ!

అంతిక సీమ శీత పవనాంకురముల్ వొలయంగ భూరుహ
ప్రాంతములందు నా హృదయ భారము తెల్ల నడంగిపోవ నే
కాంతము లోనచుంబన సుఖాను భవమ్ముల నన్ను దేల్చి, జ
న్మాంతరవాస నా మధుర మైత్రివె లాల్చెద వీవు నిద్దురా!

పవలన్ తావక దర్శనంబరుదు, నీ స్వైర ప్రవృత్తుల్ కనుం
గవకున్ దోచు నిశీథకాలమున, తద్గాఢోప గూహంబులో
నవలోకాళి సృజించు కొందును మహానందంబు సంధిల్ల, నీ
యవలోకంబున లోకమే పరవశంబై తూలు నిద్రాసతీ!

నీ విరహంబులో బ్రదుకనేర్తునె నెచ్చెలి, శైశవంబుగా జీవిక, త్వత్కృపాంబువుల సేచనమైనది, నీ స్వరూపమున్ భావనసేసి నాతలపు బొటలలో నిలుపంగలేను, ని ద్రావిశదస్మితా, కడు కృతజ్ఞుడ నీకు ననంతకాలమున్.

---

## 26. ఊదరా

మాలపల్లెల నిదుర
మాంద్యంబు దొలగింది
కార్య దీక్షకు మనసు
కళవళము నొందింది
ఊద్తరా—కొమ్మూదరా

పరిసరంబుల ప్రతి
ధ్వనులు చెలరేగినవి
ప్రతి నిస్వనములలో
పరమార్థ మొదిగింది
ఊదరా—కొమ్మూదరా

రోదసీ కుహరంబు
రోదల కంపించింది
దిక్తటంబులు బెదరి
దీర్ఘముగ నార్చినవి
ఊదరా—కొమ్మూదరా

పగటి రాకలనెల్ల
పాలెగాండ్రకుజెల్పి
ప్రాచీన యుగములో
పాలనము చేసింది
ఊదరా—కొమ్మూదరా

ఓంకార నాదమై
ఉద్ఘాత లూపింది
వీర సందేశమై
విరిసికొని వచ్చింది
బ్రహ్మాండ భాండంబు
పగులగొట్టే రవము
కాంతలకు భ్రమ గొల్పు
కాదంబి నీ రవము—
ఊదరా—కొమ్మూదరా

హృదయము ద్రేకాన
చెదరి పర్వాలు వార
ఊదరా!

---

## 27. భా వ భా గీ ర థి

కాంతిపూర్ణంబయి శోభలన్ జిలుకుచున్ పర్వెత్తు నీమూర్తి, అంతర మాలిన్యముదోచె, నీమధుర విన్యాసంబులో నొక్క సుందర స్వర్గంబు లభింపజేసితి భవత్సాన్నిధ్య మాశించి నా చర మాధ్యాయములన్ ముగించెదను స్వేచ్ఛన్ భావ భాగీరథీ!

హిమ వత్పర్వతమున్న తోన్నతము తల్లీ, నీదుజన్మ ప్రదేశము, విస్తారపు భూములందు బడి సంచారంబు గావింతు వీరములున్ కంటక పాళినీ గమన మార్గంబా పగాలేవు, సంయములీ లోతుల మున్క లెత్తగలరంబా, భావ భాగీరథీ!

శిఖనైనన్ తలదన్ని పోయెదవు నీచేబందు లోకంబు నీ వ్యవసాయంబది సర్వ సమ్మతము నీ యాలింగ నంబద్భుతంబవు, నేయుత్తమ లోక దర్శనమొ యాపాదించు, నెంతేని సంస్తవ నీయంబులు నీ చరిత్రములు మాతా, భావ భాగీరథీ!

తమలోనన్ దొరకొన్న భక్తి బుధులంతా నిన్ను పాసింతురా గమ సూక్తుల్ ప్రకటించు నీ యలలు ప్రమోగస్ హృద్యమై, సంస్కృతి శ్రీమలో నీ సహవాస సౌఖ్యము సుధాసారంబుగానెంతు, గోప్యము లెన్నేని వచింతు వర్థితులకంబా, భావ భాగీరథీ!

నీ నైర్మల్యము జూచి స్వీయహృది నెంతే పూతముంజేసి, సద్యో నిర్మాణ మొనర్చె ప్రేమరస సందోహంబు, యాత్రార్థియై నానా శైవలినుల్ గమించి యొక తృష్ణా బాధితుండంబ, ఓ జ్ఞానానంద రస స్వరూప సమభూషా, భావ భాగీరథీషా!

---

## 28. వేగుజుక్క

తారమఱుగై పోయె తారమఱుగై పోయె
ధవళ ధవళస్నిగ్ధ ధగధగ త్కాంతితో
తలసూపె నొక తార తలదాచె నొక తార

తారముఖుగై పోయె
తారముఖుగై పోయె

వేగుజామున తార, వికసించె నొక తార
కారుచీకటి దిశల కళవళము నొందినది
గగనభాగము నవ్య కళలొల్కఁ బోసినది
తారముఖుగై పోయె
తారముఖుగై పోయె

తారకా పథములో తరలె కాదంబినులు
కాదంబినీ గర్భ గతులనే దాటింది
కమనీయ కాంతిలోకాల వెలిజిల్లింది
తారముఖుగై పోయె
తారముఖుగై పోయె.

నీజన్మ వృత్తాంబు నెఱుగ జెప్పే తార
నీపోవు మార్గంబు నిజము దెలిపే తార
తార దోతెంచింది—తనదారి బట్టింది
లోక శాంతికి నభము ప్రాకింది ఈతార
తార యొక ఋషివోల తత్త్వ మెఱిగించింది
తార వెలిగిన వెలుగు తలపులో నిలిచింది

తార ముఖుగై పోయె
తార ముఖుగై పోయె
విశ్వ వీథులలోన వికసించె నీతార
విశ్వ సందేశంబు వినిపించె నీతార

తార మఱుగై పోయె
తార మఱుగై పోయె

## 29. యాత్రా విరతి

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర
సాయాహ్న రేఖలా
శాపించు లెగ(బ్రాకె
పూయలేదీ మొగ్గ
పుడమి నల్లనరాలె
తియ్య మామిడి వనుల
కోయల విలాపించె

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర
అమలమై మధురమై
ఆనంద మయమైన
సందేశ మవనిలో
చాటి రమ్మని పంపె
నా ప్రభుని యాజ్ఞ—మ
న్ననసేసి వచ్చితిని
ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర

బాష్ప పూరాలాబద్ధ
మలిన భూముల కరిగి
హాసరో చిర్చ లిత
హార్మ్య సీమలకరిగి
సందేశ నవసుధా
సారమ్ము గురిసితిని

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర
రాకపోకల లోన
నాకు నలవాటయ్యె
రాచ మార్గముబట్టి
ప్రభుని సన్నిధిచేర
పయనంబుగావింతు
పరమ హర్షోత్సుకత

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర

అతిథి వర్గమునకా
ప్యాయ మానంబుగా
ఆనందమయగీతి
నాదరించితి నేను
ఆత్మలత్ పిపాసార్థి
నపన యించితినింక

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర

క్రౌంచ మిథు నాంకురిత
కరుణమయ గాథవలె
కణ్వపుత్రీ ప్రణయ
గర్భ గీతము వోలె
నిర్వేద మాధురీ
నిభృత మైనది యాత్మ

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర.

యాత్రాశ్రమల తొలుత
అలసి సొలసిన హృదయ
మవసాన దశలోన
ఆనంద మయమయ్యె
పయనంబు గావింతు
పరమ హర్షోత్సుకత

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర
తియ్యమామిడి వనుల
కోయిల విలాపించె
నిశ్చలా నందైక
నిభృత మైనది యాత్మ

ముగియుచున్నది లోకయాత్ర
మోయ బరువయ్యె నీపాత్ర.

---

## 30. ఖండకావ్యము

ఏమహిళ కేయలంకృతి
గోముగునో సహజ శోభ కొమరారెడుచో
నామదికి నిండు తృప్తియు
నామోదము గూర్చునీ ఘనత ఖండకృతీ!
ఖండ కవితల - కొలది యగ్రాసనముల
నన్ను మన్నించి బ్రదుకు ధన్యం బొనర్చె
చేతులను మోడ్తునా యాంధ్రసీమ సాహి
తీరసజ్ఞ లోకమున కెంతేని భక్తి.

జీవిత మంతయున్ తపముచేసితి నీకయి నాహృదంతర
ప్లావితమై రసార్ద్ర మృదు భావముగా పరిపక్వమొంది నా
పావన సీమలో ప్రజల పాలిటి కల్పకమై సమగ్ర శో
భావితతిన్ వెలార్పుమని ప్రాంజలు లిచ్చెద ఖండికా కృతీ!

## సంపూర్ణము.

# "కృతజ్ఞతాదికము"

---

నా కవియ ఖండికల సమగ్రి స్వరూప మీతపోవనము. ఇవియన్నియు ఒక నిర్ణీతకాలమున రచింపబడినవి గావు. ఆ బాల్య ముగ కొనసాగివచ్చినదీతపస్సు.

ఇందలి మూడుసంపుటములు పూర్వోత్తర ఖండికలుగా విభజింపబడినవి. రచనలో కాలభేద మించుక సూచించుటయే దీనికి కారణము, బాల్యరచనలుగల పుటలయందే అనువాదరచన కొద్దిగ చేర్చితిని.

భారతి, ప్రతిభ, ఆంధ్ర, శ్రీసాధన, రేనాడు, ప్రకృతిమాత-మున్నగు పత్రికలెన్నియో తపోవన ఖండికల ప్రచురించి సాహితీ లోకమున కెఱుకపరచినవి. పత్రికాధిపతుల కెంతయు కృతజ్ఞుడను.

'తపోవన' కవితాప్రశంస, నాకందిననాటికి కళాజీవి, మాత్రమే నేను ప్రచురించియుంటిని. నాటికి సాన్నిధ్యము.-స్వర్గ ద్వారము, రచింపబడలేదు. (బాల్యరచనలుదప్ప), ఈ సాహితీ మూర్తులెల్లరు నాఅన్నలు—తమ్ములు,—వీరికి నాహృదయార్పణము.

ఈసంపుటి ముద్రించు సంకల్పముతో నాహృదయ మెఱుక పరచితిని. వెంటనే శ్రీ జి శ్రీనివాసరావుగారు ఈకార్యభారమున కియ్యకొనిరి. ఇది నాభాగ్యవిశేషము. తపోవనానిష్కారముసకు తోడ్పడుటయేగాక, నాకృతికి ఆంగ్లమున తమ అమూల్యమైన ముఖవచనము ప్రసాదించి చిరకాలము నాహృదయమున నిల్చి పోగలిగిన సోదరులు నాగురువరేణ్యులగు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారితో బాంధవ్యము నెరపిన పుణ్యమూర్తులు. వీరికి నా కృతజ్ఞత.

ఇక మిగిలినదొక చిత్రకార్య సంస్కరణము. ముద్రణలో నెడనెడ దోషములుదిద్దుట చాలక్లిష్టమైన కార్యము. ఈబరువు తేల

మోసికొని కార్యము నిర్వహించిన శిష్యులు - మిత్రులు తలమర్ల కలానిధిగారు. వీరు నాతలంపులోని వలపు.

కల్యాణమర్గము
అనంతపురం జిల్లా
1—5—1954

—బెళ్ళూరి శ్రీనివాసమూర్తి
ఆంధ్రాధ్యాపకుడు

## "శుద్ధాశుద్ధపత్రిక"

| పుట | పద్యపంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 4 | నను రాగ | వనురాగ |
| 5 | 9 | స్వాదూదకంబుల్ | స్స్వాదూదకంబుల్ |
| 11 | 2 | శైశిర | శైశిర |
| 15 | 6 | నీ ప్రేమించు | నిను ప్రేమించు |
| 17 | 2 | మూసి | మూపి |
| ,, | 3 | శృతి పేయ | శ్రుతిపేయ |
| 20 | 13 | ధారీ | ధారి |
| ,, | 23 | దలిత | దళిత |
| 21 | 13 | వేమో | వే మొ |
| 22 | 2 | నానలు | సోనలు |
| ,, | ,, | నీకవిసోత్రిప్రన్ | నీకవిత్వప్రున్ |
| 23 | 6 | ంజనుచు | నవలంజనుచు |
| 22 | 20 | కలాల్పముగా | లాకల్పముగా |
| ,, | ,, | అమలత్వమునన్ | అమరత్వము నన్ |
| 26 | 6 | ఎందాకన్ | విందాకన్ |
| 33 | 11 | ప పూర | సుధాప్రపూర |
| ,, | 13 | నిల్చె | నిల్చె |
| 36 | 16 | వెల | వెలి |
| 37 | 14 | హృద్యమైన | హృద్యమైన |
| 40 | 2 | నేమొ | మే మొ |

| | | | |
|---|---|---|---|
| ,, | 14 | ఛేద .. లు | ఛేదములు |
| 44 | 9 | ధా ్యనములో | ధ్యానములో |
| 45 | 11 | చేతుల.ు | చేతుల |
| 48 | 8 | లసంతదేశ | లసత్సందేశ |
| ,, | 20 | మడంపరా | యడంపరా |
| 57 | 13 | నిమ్ముసమ్ము | నిముసమ్ము |
| 59 | 8 | నెటు | నెట్లు |
| 62 | 9 | నాహారంబు | నాహారంబును |
| 63 | 8 | కార్యవరముల | కార్యవర్గముల |
| 64 | 13 | స్థనియాశీ | స్త్రనియాశీః |
| 67 | 6 | యరా | వ్యహా |
| 69 | 19 | దీవ్య | దివ్య |
| 70 | 11 | ననుం | ననున్ |
| 72 | 8 | భాష్ప | బాష్ప |
| 72 | 17 | ద్రిమ్మయు | ద్రిమ్మై |
| 72 | 21 | జరులు | జలులు |
| 73 | 2 | వాయెను | వాయను |
| 73 | 6 | నశించినవా | నశించినవో |
| 75 | 2 | దసగర్భితమై | రసగర్భితమై |
| 75 | 4 | నీకృపా | నీకుపా |
| 75 | 7 | మోదీ | మోద |
| 75 | 16 | ధ్యానంబు | ధ్యానంబు |
| 77 | 1 | ప్రభూ | ప్రభు |
| 81 | 6 | తరళి | తరలి |
| 84 | 13 | నించి | నిండి |
| 85 | 6 | చిరుగడల | నిరుగడల |
| 85 | 23 | దఃశింప | దరిసింప |
| 86 | | సంయుక్తచేటిన్ | సంయుక్త-చేటిక |

| | | | |
|---|---|---|---|
| ౮౮ | 7 | డయ్యో | డయ్యా |
| 89 | 16 | లెవ్వరో | లెవ్వారో |
| 97 | 13 | మించితివయ్యా | గమించితివయ్యా |
| 98 | 12 | నిల్చినవి | నిల్చినవ |
| 93 | 6 | వహియించన్ | వహించన్ |
| 100 | 4 | నీచె | నీచే |
| 100 | 7 | బేదియొ | బెదియొ |
| 103 | 13 | ఆవరించిన | ఆదరించిన |
| 104 | | (పూర్వఖండము) | ఉత్తరఖండము |
| 104 | 18 | భావానా | భావనా |
| 107 | 20 | స్పృశించిఒక | స్పృశించియొక |
| 108 | 6 | మహోద్విద్దివ్య | మహోద్యద్దివ్య |
| 108 | 10 | నిశ్వనంబు | నిస్వనంబు |
| 110 | 18 | మాతు్రి | మాతృ |
| 114 | 10 | చున్న దే | చున్న దె |
| 115 | 2 | నెవరో | నెవరోయీ, |
| | | తాకువార | తాకువార |
| 115 | 8 | సాహిత్వ | సాహిత్య |
| 115 | 15 | మైన | మైన |
| 115 | 22 | పొంకారెడు | పొంగారెడు |
| 116 | 10 | ధన్యుడు | ధన్యుడు |
| 117 | 18 | తద్గాఢోప | తద్గాఢోప |
| | | కూహంబులో | గూహంబులో |
| 118 | 16 | రోదల | రొదల |
| 120 | 9 | బుదులంతా | బుధులంతా |
| 120 | 16 | భాగీరథీఫా | భాగీరథీ! |
| 122 | 6 | శాశీదు | శాపీథు |
| 123 | 21 | పిపాసార్తి | పిపాసార్తి |

